# మననేత పరిశ్రమం.



శ్రీయుత భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు.



1931.



వెల 0-4-0.

# బ్రిటిష్ ప్రభుత్వ హయాము—స్వదేశ వస్త్ర పరిశ్రమ క్షీణదశ.



నేను యిండియాకు వచ్చినాను. ఇక్కడ మూడు సంగతులు చూడవలెనని నాకు ఉత్సాహముగ నున్నది. అవే వన ఒకటి తాజ్ మహల్, రెండు హిమాలయపర్వతములు, మూడు మహాత్మాగాంధీ. ఈ మూడింటిలో యేదో ఒకటే కోరుకొనుమని నన్ను కోరేయెడల నేను తక్కిన రెంటిని వదలివేసి మహాత్మా గాంధిగారినే చూచుటకు కోరు కొందును. గాంధిమహాత్ముడు ప్రపంచమున కెంతో బోధించ వలసి యున్నాడు — గెయికీ పండితుడు,

1924 బొంబాయి,

భారతదేశము అనాదినుండియు అనేక పరిశ్రమలకు ఆలవాలమై యుండెను. వానిలో ప్రధానమైనది వస్త్రపరిశ్రమ. భారతీయ సభ్యత అనాదియని చెప్పినప్పుడు దాని పరిశ్రమలు, కళలు, చేతిపనులు అనాదినుండియు లోకప్రసిద్ధి గాంచినవని యర్థము. లోకములో యంత్రమనునది పుట్టి, యంత్రసభ్యత ప్రారంభమై యిప్పటికి నూటయాభై యేండ్లయినను పూర్తిగ నిండలేదు. కాబట్టి అంతకు పూర్వమే ఎన్నో శతాబ్దములక్రింద పోతపోయబడిన ఢిల్లీలోని ఉక్కుస్తంభము, ఢక్కాలో తయారైన సన్నని రవసెల్లాలు—మున్నగునవి యంత్రములచే గాక భారతీయుల హస్తకళాకౌశలముచేతనే నిర్మింపబడిన వనుట నిర్వివాదాంశము.

1238 సంవత్సరమునకు పూర్వము ఇంగ్లాండులోని ప్రజలకు ప్రత్తియను వస్తువొకటి యీలోకములో కలదను సంగతి తెలియనే తెలియదు. ఈమాట యిప్పటివారికి చాల ఆశ్చర్యము గలిగింపవచ్చును. ఉన్ని పరిశ్రమకూడ యింగ్లండులో 1331 సంవత్సరమువరకు లేనేలేదు. ఆ సంవత్సరములోనే యింగ్లాండు రాజైన మూడవ ఎడ్వర్డు పరదేశముల నుండి ఉన్ని నేతగాండ్రను 70 మంది కుటుంబములవారిని యింగ్లాండుకు తీసికొనివచ్చి వారికి నివేశనాదుల నొసంగి ఆ ఉన్నిపరిశ్రమను కొలదిగ సాగించెను. పిమ్మట 1666

సంవత్సరముపరకు యింగ్లాండులోని నేత పరిశ్రమనుగురించి అంత ఎక్కువగ చెప్పుకోదగిన విశేషము లేమియులేవు. 1641 సంవత్సరములో "రాబర్ట్సు" అను నతడొక "వర్తక సంపద" యను పుస్తకమును ప్రచురించెను. ఆకాలమందు మాంచెస్టరులో ప్రత్తి పరిశ్రమ యెట్లున్నది అందు వర్ణించెను. అప్పటికే యిండియానుండి ప్రవహించుచున్న ప్రత్తి వస్త్రముల యొక్కయు, పట్టు వస్త్రముల యొక్కయు ప్రవాహమును అడ్డగించుటకుగాను ఇంగ్లీషు పార్లమెంటువారు తీవ్ర చర్యలకు గడంగవలసిన అవసర మేర్పడెను. తదనుగుణముగ 1666 సంవత్సరములో పార్లమెంటువారొక శాసనమును నిర్మించిరి. శవముల నెవరును ఇంగ్లండులో తయారైన ఉన్ని వస్త్రములతో తప్ప, మరియొక వస్త్రముతో కప్పరాదని సదరు శాసనము శాసించెను. ఇంగ్లండులోని ఉన్ని వస్త్రముల పరిశ్రమను పెంపొందించుటయే యీశాసనోద్దేశమని వేరుగ చెప్పనక్కరలేదు. 1660 సం॥లో రప శెల్లాలు యిండియానుండి యింగ్లాండుకు దిగుమతియయ్యెను. ఇండియానుండి వచ్చిన ప్రత్తివస్త్రముల నెవరును ధరింపరాదని 1700 సంవత్సరములో యింగ్లండుకు శాసనమేర్పడెను. ఈ ప్రత్తివస్త్రముల ధరించినవారికి 5 నవరసులును, అమ్మినవారికి 20 నవరసులును జరిమానా వేయబడునని యింగ్లండులో పార్లమెంటువారు 1721

సం॥లో ఒక పట్టాను చేసిరి. ఒక చతురపుగజము సుస్థకు రంగు అర్ధవరహాయైనన్నచో దానిమీద అరణాలు పన్ను విధించిరి.

పార్లమెంటువారికి రీతిగ శాసనముల గావింప వలసిన అవసరమేమి గలిగినది? ఏమనగ :— 1600 సం॥ డిశంబరు 31 వ తేదీన ఈస్టిండియా కంపెనీ ఏర్పాటైనది. 1612 సం॥లో మచిలీపట్నం (బందరు) వచ్చినది. 1631 సంవత్సరములో సూరత్తు పట్టణములో ప్రవేశించినది. 1623 సం॥రములో మద్రాసు వెళ్లినది. 1631 సం॥లో హుగ్లీ (కలకత్తా) వెళ్లినది. ఈప్రదేశములలో యీకంపెనీవారు "ఫ్యాక్టరీలు" నేర్పరచుకొనిరి. ఫ్యాక్టరీలనగ నేమి? ఎగుమతి దిగుమతుల కొరకై తమ సరకుల నిలువజేసికొనుటకుగాను రేవు వొడ్డున కట్టుకొన్న కొట్లు లేక గిడ్డంగులు మాత్రమే. వీనికే "ఫ్యాక్టరీ" లని పేరుపెట్టిరి. ఈదేశములో కొని, సీమకు పంపదలచుకొన్న వస్త్రముల బేళ్లును, తమ సీమనుండి యిక్కడ అమ్మకముకొరకై తెచ్చిన కత్తులు, కత్తెరలు, అద్దపుపెంకులు, పింగాణీగిన్నెలు మున్నగు మాయసరకులును యీ కొట్లలో నిలువ జేసికొనుచుండెడివారు. 1669 సంవత్సరము నాటికి కంపెనీతరపున స్ట్రెయిన్షమ్ మాష్టర్, హాట్రిజ్, మేహూ, అను ముగ్గురు వర్తకులకును, బందరులోని కొందరు వర్తకులకును వస్త్రముల సప్లయి విషయములో కొన్ని కంట్రాక్టులు

జరిగినట్లు కృష్ణాజిల్లా మాన్యూయల్ 5 వ అనుబంధములో వివరింపబడి యున్నది. కలంకారీలు, సతరంజీలు, పల్లంపోదులు, సాసర్ గంజీలు, దుప్పట్లు, రుమాళ్లు, అల్లికాలు, కలశపువ్వులు పనికాణాలు, లుంగీలు, శెల్లాలు, ఇజారీలు — యీరకము వస్త్రము లనేకములు బందరు నగరమువల్ల కంపెనీవారు కొని సీమకు ఎగుమతి చేసికొన్నట్లు సదరు రికార్డులలో కలదు. ఈ వస్త్రముల నక్కడ సీమలో అమ్ముకొనుటవలన కంపెనీవారికి నూటికి ఆరువందలరూపాయలు లాభములు వచ్చుచుండెను. ఇందుపై దేశమందు ఆందోళనపుట్టెను. ఇండియానుండివచ్చిన ప్రత్తి, పట్టు, వస్త్రముల ధరించుకొని తిరుగవలసిన దుర్గతి తమకు సంప్రాప్తమైనదని యింగ్లండులో కొందరు పండితులప్పుడు విలపింపసాగిరి. ఇంగ్లీషు ప్రజల దుస్థితినిగూర్చి "మెకాలే" పండితుడిట్లు విలపించినాడు :—

"వెనుక మనదేశములో ప్రతిగాను, ప్రతి [illegible], మన చేలలో మేసిన గొర్రెల ఉన్నితో మనమగ్గములమీద తయారగుచుండు వస్త్రములతో చేయబడుచుండెను. మన పొలములనున్నుకొని జీవించు రైతు ప్రజలకును, పట్టణవాసులకును కూడ, ఆరోజులే మంచిరోజులుగ నుండెను. ఆరోజులే మనకు సౌఖ్యప్రదమైనరోజులు! కాని, యిప్పుడా ఉన్ని వస్త్రములన్నీ యేమైపోయినవి? పూర్వము ఎలిజబెత్తురాణీ కాలము

లో ఆమె దివ్యప్రాసాదముల నలంకరించుచుండిన ఆదివ్యమైన ఉన్నివస్త్రములన్నియు నేడేమైనవి ? ఏచరిపూర్వీకులు యింగ్లీషు గొర్రెల ఉన్నితో యింగ్లీషువాండ్ల చేతులతో నేసిన వస్త్రములతప్ప యితర వస్త్రములను ముట్టియెరుంగరో, అట్టివారి సంతతివారైన యీనాటివారు సిగ్గులేక యిండియానుండివచ్చిన క్యాలికో సూట్లను, మూర్షిదాబాదునుండి వచ్చిన సిల్కు స్టాకింగులను వేసికొని, అదే నాగరికమనుకొని బడాయిగా వీథులవెంట తిరుగుచున్నారు ! ఇది సిగ్గుమాలిన పనికాదా?"

ఈమాదిరి విలాపమే 1619 సంవత్సరములో యింకొక కరపత్రములో ప్రచురింపబడెను. ఇందు రవసెల్లాలను గూర్చి సగము పరిహాసముతోను, సగము ప్రశంసతోను చిత్రముగ వర్ణింపబడినది. "షోకు అనేది ఒక మోహము. వస్తువ ప్రియమైనకొద్దీ, దానికి షోకు వాగరీకము హెచ్చవుతుంది. మనవాళ్లు గజము 30 షిల్లింగులు (రు 22–8–0) పెట్టి రవసెల్లాలు కొనుక్కొని షోకుగపైనవేసికొని తిరుగుచున్నారు ! ఇంతచేసినా ఒళ్లంతా కనబడుతూనే వుంటుంది" అని హేళనచేసినాడు.

శవములను ఉన్నిబట్టలతో తప్ప, ఇతర వస్త్రములతో చుట్టరాదని శాసనము నేర్పరచినట్లు పైన చెప్పియుంటిమి. ఈ నిషేధము ఒక్క శవములకే కాక, బ్రతికియున్నవారికి కూడ రేల విధించరాదని కొందరు పండితులు కోరుచుండిరి. జేని

డానియల్ డీఫో అను నతడిట్లు ఇండియా వస్త్రముల మోహ మును గూర్చి వర్ణించినాడు :—

"ప్రజలమోజు అంతా యిండియాగుడ్డలమీద పరుగెత్తు తోంది ! ఈమోజు యెంతవరకు వెళ్లిందంటే— యిదివరకు నేలమీద పరచుకునే కంబళ్లుగను, పరుపులమీద పరుచుకొనే దుప్పట్లుగను, చిన్నపిల్లలకు, సామాన్యజనులకు యిచ్చే బట్టలు గను వుండిన కలంకారీ వస్త్రములు నేడు మన నాగరిక నారీ మణుల కలంకార భూయిష్టములైనవి. "ఫ్యాషన్" యిప్పుడు యేవిధముగ మారినదో చూడండి. ఇదివరకు దాసీవాళ్లు కూడ తమకు పనికిరావని యనుకొనుచుండిన యిండియా చీటీగుడ్డలు షోకిల్లా పురుషులు ధరించు నాగరికదుస్తులై పోయినవి !— ఆహా ! యేమిమహిమ ! ఇదివరకు నేలమీద పరచు చుండిన చీటీగుడ్డ లిప్పుడు నాగరికుల భుజములపైనను, వీపులపైనను యెక్కినవి ! నడుచు నప్పుడు కాళ్లక్రింద వేసికొనుచుండిన చీటీగుడ్డ లిప్పుడు నాగరిక నారీమణులకు కంచుకములైనవి. చిట్టచివరకు రాణీగారుకూడ చీనా జపానునుండి వచ్చిన సిల్కు లను, క్యాలికోలను ధరించుచున్నది ! ఇంతేకాదు ఇండియా నుండి వచ్చిన బట్ట మన పడకటిండ్లలోనికి, దివ్యమందిరముల లోనికి, పరుపులమీదికి, కిటికీలమీదికి, కుర్చీలమీదికి, కూడ ఎగబ్రాకుతూవున్నది ! వేయేల, స్త్రీల దుస్తులలోగాని, గృహ

పరికరములలోగాని, యిదివరకు ఉన్నితోను సిల్కుతోను తయారగుచుండిన వస్తువులన్నియు యిప్పుడు యిండియానుండి దిగుమతి యగుచున్నవి. ఇదివరకు నేలమీద పరచుటకు మాత్రమే ఉపయోగించుచుండిన కలంకారీ గుడ్డల నన్నిటిని యీ మేరీరాణీ వచ్చి సిగ్గులేక వీపుమీదను, నడుముమీదను ధరించి తక్కిన వారందరికి యీదిక్కుమాలిన "ఫ్యాషన్" నేర్పినది అని ఒకానొక పండితుడు మేరీరాణీని నిరసించెను. యార్కుషైర్, విల్టుషైర్, నార్విచ్, స్పిటుఫీల్డు మున్నగు జిల్లాలలోనున్న ఉన్నివర్తకులంతా చేరి యిండియా గుడ్డలు యింగ్లండులోనికి రాకూడదని 1688 సం॥లో పెద్ద ఆందోళన బయలుదేరదీసిరి. ఇండియానుండి 1667 సంవత్సరములో లక్షా అరవైవేల పౌనులు బరువుగల వస్త్రములు యింగ్లండు లోనికి దిగుమతియయ్యెను. రగ్గులు, అద్దకపుబట్టలు, దుప్పట్లు, తలుపులకు వేసికొను తెరలు, యీరకపుగుడ్డలు 3 లక్షలరూపా యలు ఖరీదు గలిగినవి 1681 సం॥లో యిండియానుండి యింగ్లండుకు దిగుమతి యైనట్లు పార్లమెంటులో లెక్క వేయ బడినది. ఈ వర్తకమువల్ల యీస్టిండియా కంపెనీవారి లాభ ములు విపరీతముగ హెచ్చిపోవు చుండెను. మామూలుగ పంచుకొను లాభములుగాక, షేరుధనమునకు సమానమగు మొత్తమును అదనపు లాభముగ ఆసంవత్సరము కంపెనీ భాగ

స్వాములు పంచుకొనిరి ! దీనివలన యింగ్లండులోని ఉన్ని వ్యాపారము అంతరించెను. ఈవ్యాపారమువల్ల జీవించు వారి జీవనోపాధులు పోయినవి. ఈజనమందు గగ్గోలుపుట్టి ఇండియాదేశపు శిల్కులు యింగ్లాండులోకి దిగుమతికాకుండ వానిని ఎవరు ధరించకుండ, ఉండులాగున చట్టము ఏర్పరుప వలసినదని పార్లమెంటుకు వత్తిడి గలిగించిరి. అంతట పార్లమెంటువారు యిండియా సరుకుపై నూటికి పదిరూపాయలు మొదలు 3 వేల రూపాయలవరకు భారమగు పన్నును విధించిరి. ఈశిల్కులు విస్తారముగ గుజరాతు, కోరమాండల్ కోస్తా, బంగాళా దేశములనుండి సీమకు ఎగుమతి యగుచుండెను. 20 గజముల పొడవు, ఒకగజము వెడల్పు గలిగిన రవసెల్లాను చేయుటకు పది మొదలు 60 రోజులవరకు పట్టుచుండెను. ఇట్టి సెల్లాఖరీదు నూరు మొదలు నాల్గువందల రూపాలవరకు వుండెను. ఈసెల్లా బహుసన్నముగ నుండుటచే దీనికి వాయు వస్త్రమని కూడ కవులు అలంకారముగ వర్ణింపుచుండిరి. ఈ వస్త్రములు సాలెపురుగు అల్లిన అల్లికతోను, ప్రవహించు నీటితోను చమత్కారముగ పోల్చబడినవి. ఒక నేతగాడు రవసెల్లాను పచ్చిక బయలుమీద పరవగ, ఒక ఆవువచ్చి ఆ సెల్లా అక్కడ ఆరవేసియున్నదను సంగతి తెలియక, గడ్డితో సహా దానిని నమలివేసెను. ఆ నేతగాడింత అజాగ్రత్తగ నుంచి

నందుకు నవాబు అలీవర్ధీఖాన్ అతనిని శిక్షించెను. ఔరంగజేబు పాదుషా కొమార్తె లొకసారి దర్బారులోనికి రాగా "మీరేల యిట్లు దిగంబరులుగ వచ్చినార"ని ఔరంగజేబు వారిని మందలించెను. అప్పుడు వారు తమ శరీరముపైనున్న ఏడు రవశెల్లా మడతలను చూపగ, ఔరంగజేబుయొక్క కోపము ఆశ్చర్యముగ మారెను. ఈవస్త్రముల ప్రాశస్త్యమును గూర్చి టావర్నియర్, బర్నియర్, మున్నగు పరదేశ రాయబారులుకూడ మిక్కిలిగ ప్రశంసించియుంశిరి. హిందూదేశ వస్త్రవ్యాపార మానాడు అరేబియా, పర్షియా, ఈజిప్టు పెగు, మలాకా, సుమత్రా, మధ్యధరా సముద్రప్రాంతదేశములు—మున్నగు ఖండాంతరములకు కూడ ప్రాకియున్నట్లు నిదర్శనములు కొల్లలుగ గలవు. డక్కా రవసెల్లాలను గూర్చి వేరుగ చెప్పనక్కరలేదు. ఒక్క డక్కానగరమునుండి సాలుకు కోటిరూపాయల రవసెల్లాలు పరదేశములకు ఎగుమతి యగుచుండెను. వీనిలో మూడవ వంతుకు పైగా యింగ్లండుకు పోవుచుండెను.

ఇట్లుండగ, యింగ్లండునందు పారిశ్రామికాభివృద్ధి కొనసాగ నారంభించెను. 1733 సంవత్సరములో జాన్ కే అను నాతడు మరమగ్గమును కనుగొనెను. 1738 సం||లో లూయీ పాల్ అనునాతడు దూదేకుడు యంత్రమును కనిపెట్టెను.

వడుకు యంత్రమును కనిపెట్టినవారికి గొప్ప బహుమాన మిత్తు మని 1761 లో ఒక సంఘమువారు ప్రచురించిరి. 1764 లో జేమ్సు హార్‌గ్రీవ్సు అనునతడును, 1767 లో ఆర్కు‌రైటు అనునతడును వడుకు యంత్రములను గనిపెట్టిరి. 1774, 1775 లలో యింకా అనేక రకములగు యంత్రములు బయలుదేరెను. 1778 లో యింగ్లాండులో ఒక సెల్లా నేయబడెను. 1782 లో "జేమ్సువాట్" అను నతడు "స్ట్రీముయింజను" కనిపెట్టెను. 1785 లో ఎడ్మండుఆర్కు‌రైట్ అను నతడు ఆవిరిమగ్గమును కనిపెట్టెను. ఈరీతిగ 1791 నాటికి యీవ్యాపారము యింగ్లండులో బాగుగ సాగెను. అందుచే ఆసంవత్సరములో వారు లక్ష 89 వేల పౌనుల బరువు గలిగిన పత్తిని అమెరికానుండి తెప్పించుకొనిరి. 1798 లో "జాక్వర్డు" అనునత డొకరకము మగ్గమును తయారు చేసెను. అందువల్ల వస్త్రముల యుత్పత్తి అత్యధికముగ జరిగెను. వెంటనే యంత్రపరిశ్రమకు ఫలితమగు దుష్టపరిస్థితు లెన్నో పొడచూప నారంభించెను. 1812 లోనే యీ యంత్రములలో పనిచేయు కూలివాండ్రలో గొప్పకల్లోలములు పుట్టెను. ఈఅల్లరులు, కల్లోలములు, "నాటింగామ్" జిల్లాలో మిక్కిలి హెచ్చై, అవి అయిదేండ్లవరకు చల్లారలేదు. ఈ అయిదేండ్ల అల్లకల్లోలములో — చాలమంది కూలివాండ్రకు

ద్వీపాంతరవాస శిక్షలు పడెను. 1814 లో ఎప్పు డైతే "హారక్సు" అనునతడు ఆవిరియంత్రమును నూలు నేతకు సంధించెనో అప్పుడే యిండియాయొక్క దుర్గతి ప్రారంభ మయ్యెను. ఆనాటినుండి క్రొత్త క్రొత్త యంత్రములు, పరికర ములు, బయలుదేరి క్రమముగ భారతదేశపు పరిశ్రమను పూర్తిగ నాశనము చేసినవి. ఒకవైపునకు ప్రవహించుచుండిన ప్రవాహ మును, యిప్పుడు గిర్రున వెనుకకుతిరిగి ఎదురుముఖముగ ప్రవ హింపసాగెను. ఇట్లే 1832 లో డండీ పట్టణములో జనప నార పరిశ్రమ సాగెను. 1850, 1851 సంవత్సరములలో క్రొత్త క్రొత్త యంత్రములు బయలుదేరెను. ఈయంత్రముల యభివృద్ధి నానాట బహుతీవ్రగతిని జరిగి, భారతదేశ పరిశ్ర మల వినాశనమునకును యింగ్లాండుదేశ పరిశ్రమల యభివృద్ధి కిని కారణమయ్యెను.

ఈరీతిగ యింగ్లాండు అభివృద్ధి పొందుచుండగ, చిర కాలమునుండి అనేక వృత్తులకు చేతిపనులకు, ఆలవాలమైన భారతదేశము క్షీణింపసాగెను. పూర్వమునుండి దేశమందెన్ని రాజకీయ సంక్షోభములు గలుగుచు వచ్చినను, దేశప్రజల వృత్తులను నాశనముచేసిన వారెవరును లేకుండిరి. అట్లుగాక, అక్బరు చక్రవర్తి కాలములో దేశపరిశ్రమలు, వృత్తులు అత్యు ద్భుతముగ పెంపుగాంచినవి. రవసెల్లాలు జిలుగు నేత

పనులు, రకరకముల పట్టుచేతలు చెమ్కీలు బంగారు జల్తారులువేసిన శిరోవేష్టనములు, నవరత్నములతో పొదగబడి సహజముగనీ మయూర సింహాసనము, పట్టు, ముఖమల్, తో తయారైన రత్నకంబళములు మున్నగు అత్యద్భుత కళా కౌశలముల ప్రదర్శించు వస్తుజాలములెన్నో ఆక్బరుకాలమందు ప్రభవించుచుండెను. వీనినన్నిటిని గాంచి పరదేశములనుండి వచ్చిన రాయబారులు, యాత్రికులు, ఎందరెందరో ఆశ్చర్య నిమగ్నులగుచుండిరి. మూర్షిదాబాదు పట్టణము అసంఖ్యాక ప్రజ కాలవాలమై, లండన్ నగరముతో తులదూగుచుండెనని "కాటన్" అను ఆంగ్లేయుడే వర్ణించియుండెను. మరియు లండన్‌వాసులకంటె మిక్కిలి ధనాఢ్యులైన ప్రజలు మూర్షి దాబాదులోనుండిరనికూడ అతడు వర్ణించెను. హిందూదేశపు వస్త్రములు ప్రపంచములో నెవరును, ఎన్నడును, ప్రదర్శింప జాలని హస్తకళాకౌశలమును వ్యక్తపరచుచుండెనని మురే యను ఆంగ్లేయ చరిత్రకారుడు వర్ణించియున్నాడు. ఇట్టివీనిని సంపాదించుటకై ఖండాంతరములనుండి వర్తకులు అనేక శ్రమ లకును, ఘోరబాధలకును, ఓర్చి, యిండియాకు వచ్చుచుండిరి. 1600 లో ఈస్టిండియా కంపెనీవారు యిండియాలో వర్తకముచేసికొనుటకై తమ ఎలిజబెత్తు రాణీవద్దపట్టాను పుచ్చు కొనివచ్చినప్పుడు యిండియాసరుకులు తీసికొనిపోయి యిఙ్గ్లం

ములో అమ్మకొనుటకే వారుసంకల్పించిరిగాని, సీమసరుకును కూడ యిచ్చి దానికి ప్రత్యామ్నాయముగ యిండియాసరుకు తీసికొనిపోవుటకుకాదు. ఏలననగ :— సీమవారు మనకు యివ్వదగిన వస్తువులప్పు డేమియుండెను ? వారికి పరిశ్రమలని చెప్పుకోదగినవేమియు లేకుండెను.

ఇండియాలోని పరిశ్రమలను నశింపుచేయుటకు సీమలో వారు తమపార్లమెంటుద్వారా చేసినచట్టములుచాలక యిక్కడ యిండియాలో కంపెనీయుద్యోగస్తులు తమ దౌర్జన్యమువలన కూడ యీవృత్తులను బలాత్కారముగ చంపివేసిరి. ప్లాసీ యుద్ధానంతరము, రాచకీయాధికారము తమకు లభించిననాట నుండి కంపెనీ యుద్యోగులు దేశీయవర్తకులపై నానాదౌర్జన్యమునుచేసి వారిననేకవిధములపీడించి దేశీయవర్తకమును, వృత్తులను రూపుమాపిరి. కంపెనీవారు దేశీయరాజుల అంతఃకల్లోలములలో విచ్చలవిడిగ ప్రవేశించి, పిల్లిమీద ఎలుకను, ఎలుకమీద పిల్లిని ఎక్కించి, దేశీయమంత్రులతోను, సేనాపతులతోను కుట్రలపన్ని, వారికి లంచపంచములనిచ్చి చీలదీసి, దేశము క్రమముగ వశపరచుకొనిరి. ప్లాసీయుద్ధానంతరము యింగ్లీషువర్తకులు బహుక్రూరపద్ధతుల నవలంబించి తమ వర్తకాభివృద్ధికై దేశములోని వస్త్రములన్నిటిని కాజేయుచుండిరి. దీనికి సహింపక బంగాళా నవాబుగానున్న

మీరు ఖాసీం ప్రతిఘటించినప్పుడు కంపెనీవారాతనిని సింహాసనా భ్రష్టునిచేసి బంగాళీమునకు తామే ప్రభువులైరి. కంపెనీ వారు పెట్టిన బాధలు బహుఎక్కువగానుండి, ప్రతిరాట్నము పైనను మగ్గము పైనను, ఆసుపైనను ప్రతినేత పరికరముపైనను భారమగు పన్నులవిధించిరి. దేశీయరాజులతో చేసుకున్న సంధిపత్రములలో సదరు రాజులు తమదేశములో నుత్పన్నమగు వస్త్రమునంతను కంపెనీవారికే యిచ్చివేయునట్లొకషరతును విధించుచుండిరి. అట్లె నేతగాడైన నివ్వనిచో వానిని ఘోరముగా హింసించుచుండిరి. ఒకనూరేండ్లకుపూర్వము ఒక కలకత్తారేవు పట్నమునుండి మాత్రమే రెండుకోట్లరూపాయలపస్త్రములు ఎగుమతియగుచుండెను. యిప్పటి ధరప్రకారమది పదికోట్ల రూపాయిలగును. అట్టి వైభవమంతయు నేడ దృశ్యమయినది. డక్కాలోని నేతగాండ్రు తమ బొటన వ్రేళ్లను తామే తెగగొట్టుకొనిరనుచో కంపెనివారు తమ్ము నెంత ఘోరముగా హింసించియుండిరో యూహించుకొనవలెనేగాని వర్ణింపనలవికాదు. ఏడుపందల నేతగాండ్రకుటుంబములు కంపెనీవారి బాధలు పడలేక తమ జన్మస్థానమగు జంగల్బరిజిల్లాను వదలి దేశాంతరములపాలయినట్లు స్పష్టముగా రికార్డులందుకలదు. కంపెనీవారును కంపెనీ ఉద్యోగస్తులును వారికి వశులైన స్వదేశరాజులును ప్రజలను పెట్టినబాధలు

వర్ణింప తరముగాదు. అవి గర్భనిర్భేదముగానున్నవి. నేత గాండ్రు తమసరుకును కంపెనీనౌకరులుచెప్పిన ధరలకు యిచ్చివేయవలసినదే. వారు బహుతక్కువ ధరలకడుగుచుండెడివారు. ఈతక్కువధరలకు నేతగాండ్రు ఒప్పుకొనని యెడల వారిని తుపాకి మనుజులతో భాదిచి ఒప్పించుచుండెడివారు. అతి అన్యాయమగు కంట్రాక్టులనువ్రాసి నేతగాండ్రచేత బలాత్కారముగా ఒప్పించుచుండెడివారు. అట్లు ఒప్పుకొననివారిని బొండకొయ్యనువేశియు కొరడాలతోకొట్టియు ఒప్పించుచుండిరి. ఈబాధలు దక్షిణహిందూస్థానము బంగాళాదేశము సూరతురాజ్యములలో హెచ్చుగానుండెను. ఇవే వస్త్రపరిశ్రమకు ప్రధానస్థానములు. దేశీయవర్తకులెవరును నేతగాండ్రనుండి వస్త్రములను కొనకూడదని నిషేధించిరి. అట్లెవరయిన కొనదలచుకొనినయెడల కంపెనీవారినుంచి లైసెన్సు పొందవలెనని విధించిరి. ఈబాధల సహింపలేక, యీవృత్తిగిట్టుబాటుగాక యీనేతవృత్తిని వదులుకుంటాం బాబు అన్నవారినికూడ అట్లువదలుకొనుటకు వీలులేదని నిర్బంధించిరి. వీరు యీనేతవృత్తిని వదలి యితరవృత్తులకై బయట కెచటికైన పోదురేమోననిచెప్పి వారు తమ యిండ్లనువదలి బయటికి పోకూడదని నిర్బంధించిరి. ఏపనిమీదనైన బయటికి పోదలచినయెడల కంపెనీవారినుండి దారిచీటి పుచ్చుకుని

పోవచ్చుననిరి. కంపెనీవారికికాక యితరులకెవరికైన సరుక్షు రవాణాయగుచున్నపుడు త్రోవలో గేట్లుపడ్డ భారమగు పన్నుల వసూలు చేయుచుండిరి. కంపెనీ గవర్నరు సంచారము వెడలినపుడు కంపెనీకి వసూలయిన దేశీయరాజులు తమ రాజ్యములోగల నేతగాండ్రు వర్తకులు యావన్మంది తమ వద్దనున్న వస్త్రములనన్నిటిని సదరు గవర్నరుగారికిని వారి గుమాస్తాలకును యిచ్చివేయవలసినదనిన్నీ ఫర్మానాల నంపు చుండిరి. ఒకప్పుడు యింగ్లీషువారును డచ్చివారును కలసి దేశములోని నేతగాండ్రందరను పంచుకుందామని అనుకొనిరికాని సీమలోని కంపెనీ డైరెక్టర్లు దీనికి ఒప్పుకొనలేదు. యీరీతిగా దేశములోని నేతగాండ్రిందరిని కంపెనీనౌకర్ల క్రింద బానిసలుగాచేసి వైచిరని చెప్పుటకు తగినంత ఆధారములు మద్రాసులోనున్నగు ఆంగ్లేయోద్యోగులు వ్రాసిన వ్రాతలలోనే కలదు. 1813 నాటికి నేతపరిశ్రమ దాదాపు అంతరించినది. మరియు 1820 నాటికి కథ అడ్డముగా తిరిగి యింగ్లండునుంచి యిండియాకు డెబ్బదిలక్షల రూపాయిల ఖరీదుగల వస్త్రములు దిగుమతియయ్యెను.

అప్పటినుండి నేతవృత్తి యింగ్లండులో అభివృద్ధి అగుటయూ యిండియాలో క్షీణించుటయును జరిగెను. తిరిగి దానిని

పునరుద్ధరించుటకై సి. ఢన్. దేవారు అనువారు 1851 సం॥ బొంబాయిలో బట్టలమిల్లు కట్టుటకు ప్రారంభించి 1853 లో పూర్తిచేసిరి. హిందుదేశములో నేతవృత్తిని నాశనము చేసినదిచాలక దానిపునరుద్ధారణకై ప్రారంభమయిన కొలది ప్రయత్నమునుకూడ భంగపుచ్చుటకై యిండియాలోనికెల్ల ప్రత్తిపంటకు నిలయమైన బీరార్ రాష్ట్రమును ఏదోమాయ చేసి నైజామునుంచి లాగుకొని తమవశపరచుకొనుట అవుసర మని అప్పుడు గవర్నరుజనరలుగావున్న డాల్ హౌసీకి తోచెను. వెంటనే ఏదో మాయోపాయమువన్ని సైన్యపుఖర్చు బాపతు ఖాతాబాకీయున్నాడని పేరుపెట్టి దానికిక్రింద యీ బీరారురాజ్యమును కాస్త నైజాము చేతినుండి లాగుకొనెను. మరుసంవత్సరమే ప్రత్తిపంటకు పుట్టినిల్లయిన నాగపుర రాజ్యముకూడ నిస్సంతయినవానికి దత్తతాధికారము లేదను అక్రమచట్టమును ప్రయోగించి సదరు నాగపూరు రాజ్యమును కంపెనీవారు తమరాజ్యములో కలుపుకొనిరి. గ్రాండుట్రంకు ఎక్స్ప్రెస్రయిలులో ఎక్కి కాజీపేటనుండ యిటార్సీ వరకుపోయిచూచినయెడల యావత్తు మధ్యరాష్ట్రమును ప్రత్తి పండు నల్లరేగడభూమి కనుచూపుమేరవరకును ఏకసమతల ముగా గాన్పించును. 1857 సంవత్సరమున జరిగిన స్వాతంత్ర్య విప్లవమునకు కొలదికాలముక్రితము డాల్ హౌసీయొక్క

కుతంత్రముచే ప్రత్తిపండు యీమధ్యరాష్ట్రము యావత్తు కంపెనీవారి వశమయ్యెను.

అనాదినుండియు భారతదేశమందు వర్ధిల్లిన కృత్తులను చేతిపనులను తాము బుద్ధిపూర్వకముగా నాశనముచేసిన సంగతిని ఆంగ్లేయాధికారులు జ్ఞాపకమేమియు లేక చెప్పుచునేయున్నారు. ఇండియాగవర్నమెంటు మెంబరైన సర్ బేసిల్ బ్లాకెట్ గారు యిటీవల ఒకచోట ఉపన్యసించుచు యిట్లుచెప్పెను.

" పాశ్చాత్య నాగరికతవల్ల అందు ముఖ్యముగా యింగ్లాండునందు ప్రబలిన యంత్రసామగ్రివల్ల హిందూదేశమునందు మంచిసరుకులు చవుకధరలకు లభించినను హిందుదేశపు గ్రామముల ఆర్ధికసంపద పూర్తిగా నాశనమయ్యెను. పూర్వకాలము హిందూదేశమునుండి యితర దేశములకు విరివిగా ఎగుమతి యగుచుండిన వస్తుసామగ్రి, అందు ముఖ్యముగా లోకప్రఖ్యాతిగాంచిన మజిలిన్లు యిప్పుడు పూర్తిగా అదృశ్యమయినవి. ఆకాలమందుండిన యిండియా ప్రభుత్వమువారు సీమలోని మాన్చెష్టరు యంత్రశాలాధికారుల లాభములనే ఎక్కువగా పాటించవలసినవారై భారతదేశపు ఆర్ధిక సంపత్తు విషయమై జోక్యము కలిగించుకొనలేదు. శాంతి భద్రతల కవ్వనరమగు పన్నులను మాత్రము శిస్తుదిగా విధించుచూ నూర్ధ

కుండిరి." ఈయంత్రియు సరుకుల ప్రివాహమేమి మన ఇండి యాపై తెచ్చి పడవేసిన మంచిరకపు చవుకవస్తువు లేమి. ఉదయము మొదలు సాయంకాలమువరకు ఇంగ్లీషు చదువుకున్న ప్రతివారు పల్లెటూరిలోని స్త్రీ పురుషులుకూడ విదేశవస్తువు లనే విపరీతముగా వాడుచున్నారు. పండ్లపొడి, పండ్లజిగురు బ్రిష్లు, నాలుక గీసుకునే పద్ధతులు, మంగలికత్తులు, రాళ్లు, తోళ్లు, తోళ్లమీదవేశే జిగురు, స్వయముగా క్షౌరముచేసు కునే రకరకముల మంగలికత్తులు, వానికి సంబంధించిన బ్లేడ్లు సానపట్టుసామగ్రి, అద్దములు, రకరకముల సబ్బులు, ఒళ్లు తోముకునే రబ్బరుతిత్తులు, తలనూనెలు, తలదువ్వుకునే బ్రిష్లు రకరకముల మొహంమెరుగులు, లవండరు వగైరా వాసనద్రవ్య ములు, గిల్టు బంగారపు పిన్నులు, చొక్కాలకు తగిలించు కొను లంకెలు, మెడకు తగిలించుకొను టైలు, ఎత్తైనకాలర్లు, గ్లాసోక్కాయల్లులు, చంచాలు, ఫోర్కులు (ముళ్లగరిటెలు) టీ కాఫీత్రాగే గిన్నెలసెట్లు, సిగరెట్లు పెట్టుకునేవి, వాని నుసి దులిపేవి అగు పింగాణి చలవరాతిగిన్నెలు, పళ్లెములు, బిస్కట్లు, సీమనుంచి దిగుమతియైన నానారకములపండ్లు, కాయగూరలు, మాంసపువంటకములు, ఆస్ట్రేలియా డెన్మా ర్కులనుంచి దిగుమతియగు వెన్న, పాలు, గుడ్లు, మొగడ యనున్నా అరువదినాల్గు రకములసెంట్లు, స్విడ్జర్లండునుంచి గడి

యారములు చేతికఱ్రలు, పట్టుగుడ్డగొడుగులు, షికారు వెళ్లు నప్పుడు ధరించు నానారకాల కోట్లు, వందలకొలది రకముల మోటారుకార్లు, బూట్లు హాట్లు టెన్నీసుబ్యాట్లు, హాకీ కఱ్రలు, లాంతర్లు, యినపమంచములు, దోమతెరలు, ప్రయా ణముకు కావలశిన ట్రంకులు, చేతిసంచులు, సూటుకేసులు, తోలు, కాజానాసు జోళ్ళ—సాలు, బల్లలమీదవుండు ఎల క్ట్రిక్కు—పంకాలు, వెన్నతీయు మరలు స్టవ్‌లు, ఇస్త్రీ పెట్టెలు, బట్టాయికత్తులు, రకరకాల లెటరుపేపర్లు, కలం దాన్లు, క్లిప్పులు, కాగితములుఎగురకుండ పెట్టుకొను గాజు రాళ్లు, నానారకముల సిగరెట్లు, చుట్టలు, వగైరా సీమసరుకు ఎటుచూచినను నలుముఖముల మనకండ్లకు ప్రత్యక్షమగు చున్నవి. బుద్ధిని భ్రమింపజేయుచున్నవి, మనయిళ్లను గుల్ల జేయుచున్నవి. బెల్జియమునుండి తివాచీలు, జకోస్లేవియానుండి కుర్చీలు, చిత్తరువులుచెక్కిన బల్లలు, విద్యుద్దీపములు, పం కాలు, పొయ్యిలు, కాఫీ టీ కాచుకునే పాత్రలు, చేతిదీప ములు, యీరకము వస్తువులు బజారులలో ఎన్నియైన గాన్పిం చును గాని ఒకవీశెడు పత్తిమాత్రము కనుపించదు. ఇంగ్లండు, అమెరికా, యూరపు, జపాను మొదలుగాగల ఖండాంతర ములనుండి వచ్చిన మన జీవయాత్రకు యంతమాత్రము అవస రములేని యీ వెక్కు—మాలిన మాయసరుకు ఏపల్లెటూరిలో

చూచిన కన్పించుచుండగా ఎక్కడ, ఏబజారులోనైన, ఒక వీసెడు ప్రత్తిగాని, ఒక వార రాటపు నూలుగాని కనుపడక పోవుట నిజముగా పరిహాసాస్పదము, దుఃఖకరము కాదా !

ఈ రీతిగా పరదేశములకు కాల్వలుగట్టి పోవుచున్న ధనప్రవపవాహమునాపుటకే గాంధిమహాత్ముడు ఖద్దరు ఉద్యమము బయలుదేరదీసెను. 1920 శెప్టెంబరుమాసమున కలకత్తా కాంగ్రెసునందు గాంధిమహాత్ముడు ఖద్దరుద్యమమును ప్రశంసించినపుడు దీనినపుడంతగా ఎవరును లక్ష్యపెట్టలేదు. కాని ఆసంవత్సరము డిశంబరులోనే నాగపురములో జరిగిన కాంగ్రెసులో ఖద్దరు స్థిరపరుపబడినది. దానితోపాటు రెండుమూడు రకముల స్వదేశీబట్టలుకూడ అంగీకరింపబడినవి. అవేవనగా మిల్లునూలుతో చేతిమగ్గముమీద నేసినది ఒకరకము; మిల్లునూలుతో మిల్లుమీద నేసినది రెండవరకము, సీమనూలుతో మిల్లుమీద నేసినది మూడవరకము. ఈమూడురకములుకూడ ఖద్దరుతోపాటు స్వదేశవస్త్రములుగా అంగీకరింపబడినవి. దేశమందు గొప్పనైతికోద్యమము బయలువెడలి చేతితోవడకి చేతితోనేసిన ఖద్దరుగా అంగీకరింపబడినది. దేశభక్తులకందరికి యిదియొకచిహ్నముగా నేర్పడినది. ఖద్దరుతప్ప యితరవస్త్రములు కట్టిన కాంగ్రెసు సభ్యులు యితరకాంగ్రెసు సభ్యుల నిరసనకేకాక యితర

రాజకీయ పార్టీలవారి నిరసనకుకూడ పాత్రులగుచుండిరి. ఇట్టితీవ్రప్రజాభిప్రాయము ఒక్కరోజులో కలుగలేదు. ఈఖద్దరభిమానము నెమ్మదిగా ప్రజలలో ప్రాకజొచ్చెను. తుదకు నాల్గుసంవత్సరములు గడచునప్పటికి కాంగ్రెసుకార్య నిర్వాహక సభ్యులు విధిగా ఖద్దరునే ధరించవలయుననియు విధిగా నూలువడుకవలయుననియు 1925 సంవత్సరము జనేవరు ఒకటవతేదికి కాంగ్రెసువారు విధించిరి. మరియు కాంగ్రెసు మెంబరు సభ్యత్వమునకే నూలుచందా విధింపబడెను. దేశ మోక్షమునకు ఖడ్గమునకు ప్రత్యామ్నాయముగా రాట్నమే పరమావధియని ప్రజలకు దృఢనిశ్చయముగా నేర్పడెను. క్రోధము, దౌర్జన్యము మున్నగు హింసామార్గములను కాంగ్రెసునూ దేశమునూ పూర్తిగా విరమించెను. శరీరపరిశ్రమకు పాశ్చాత్యదేశములలోకంటెకూడ అత్యధికమగు గౌరవస్థానము నొసంగబడెను. పాశ్చాత్యదేశములలో నేపని చేసినను అది కృషిగనే భావింపబడును. కాని, భారతదేశములో మానవ జాతికి అన్నవస్త్రములనొసంగు మానవకృషియే నిజమగు మానవసేవగా నంగీకరింప బడుచుండెను. పరదేశములనుండి దిగుమతియగు వస్త్రములమూలమున భారతదేశ ప్రజలనోటి కడ యన్నము పోయినది. భారతదేశపు సంపదయేగాక గౌరవముకూడ మంటగలసినది. ప్రజల వృత్తులు నశించినవి, కాబట్టి

ఖద్దరు ఉద్యమమునందు జెల్లాకాంగ్రెసు ఒకనూతనయుగమును సృష్టించెను. ఆకాంగ్రెసుమహాసభయందు సమావేశమయిన స్త్రీపురుషులెల్లరునూ భగవంతునియెదుట ఖద్దరు దీక్షనుపూనిరి. నూలుచందాపద్ధతిని జయప్రదమొనర్చెదమని వారెల్లరు ప్రమాణములగైకొనిరి. అప్పటినుండియు దేశమందలి వివిధప్రాంతములలో అనేక ఖద్దరుసంస్థలు బయలు వెడలెను. డబ్బిచ్చి ప్రత్తికొనుటయు, ప్రత్తియిచ్చి ఏకులు తీసుకొనుటయు, ఏకులిచ్చి నూలుతీసుకొనుటయు, నూలు నిచ్చి బట్ట తీసుకొనుటయు, బట్టను తిరిగి డబ్బు కమ్మునట్లును ఏర్పాటయినది. అదియు గాక దొడ్లలో ప్రత్తిని పండించుకొని యింట్లో వడుక్కొని, తనచావడిలో నేసుకొని శరీరముపై ధరించుట ప్రతి కాంగ్రెసు మెంబరుకు విధియనుభావము బాగుగా వ్యాపించెను. ఇట్టిభావము కాంగ్రెసు మెంబర్లయందేగాక, వేలకొలది కాంగ్రెసు అభిమానుల యందుకూడ వ్యాపించెను. పూర్వము గ్రామస్థులెవ్వరును బస్తీలనుండి బట్టలకొనెడివారుకారు. వివాహములు వచ్చినపుడు తాము వడికిన వడుగులను సంతలలోయిచ్చి, వానికిబదులుగా వస్త్రములను, తీసుకొనెడివారు. వడుగులు లేనపుడు అవితయారయేవరకు పెండ్లిండ్లు ఆపుచేసేవారు. నేతి విషయముకూడ నిటులనే యుండెను. నెలలతరబడి నెయ్యి చెడిపోకుండునటుల భద్రపరచే మార్గము

వారెరిగియుండిరి కావున వారెన్నడు బజారునెయ్యిని కొనెడి వారు కారు. ఇప్పుడు బజారులోనికి అనేకరకముల కల్తీ నెయ్యి వచ్చుచున్నది కాని ప్రభుత్వమువారు దీని నాపకుండ బుద్ధిపూర్వకముగ యూరకొనుచున్నారు. ఈపూర్వపు పద్ధతిని సంపూర్ణముగా పునరుద్ధరించుట ప్రస్తుత పరిస్థితులలో సాధ్యము కాకపోవచ్చును కాని, పైనచెప్పిన రెండుదాహరణములను బట్టి పూర్వము అన్న వస్త్రముల విషయమున పరాయి చోట్లకు పోనక్కరలేకుండా ఎట్లు స్వతంత్రముగా నుండెనో స్పష్టము కాగలదు. కాబట్టి భారతదేశమందు నేతవృత్తిని పునరుద్ధరింప యత్నించుచున్నామనగా అనాదినుండి జయప్రదముగా అసలు జరుగుచుండిన పద్ధతినే తిరిగి ప్రవేశ పెట్టుచున్నామే గాని, నిష్ప్రయోజనమగు కొ్రత్తపద్ధతిని ప్రవేశపెట్ట సాహసించుటలేదు. గ్రామాదులలో ప్రజలకు కావలసినంత తీరికయుండును. ఈతీరిక సమయములలో ప్రజలు చీట్లాట, జూదము, వట్టి ఖబురులు, వ్యాజ్యములు, మున్నగు దుర్వ్యసనములలో తగుల్కొనియుండుట శోచనీయము. ఈ నిర్వ్యాపార స్థితి యంతరించవలెను. వ్యవసాయకులకు తీరిక సమయములలోనూ, స్త్రీలు తమ ఇండ్లనుండి వెలుపలికేగకుండనే తమ కుటుంబగౌరవము కాపాడుకొనుచూ జీవనము చేయుటకునూ ఏదైన వృత్తిని కనిపెట్టవలెనని సర్వ విశ్వేశ్వ

కయ్య మున్నగు రాజ్యాంగవేత్తలెల్లరు ఎంతో శ్రమపడుచుండిరి. కాని అనాదినుండి అమలులో నున్న ఖద్దరు పరిశ్రమను గాంధి మహాత్ముడు తన ప్రతిభా సంపత్తిచే కనిపెట్టువరకు యిట్టివృత్తిని కనిపెట్టగలిగిన మానవు డెవ్వరును లేకపోయెను. రాట్నపరిశ్రమ మిక్కిలి సులభమయినది. దానికి పావలా ఏకులు తప్ప విశేషము పెట్టుబడి అవసరములేదు. ఇండియాకంతకు బట్ట సప్లయి చేయవలెనన్నచో, 5 కోట్ల రాట్నము లుండవలెను. కుంటి, గుడ్డి, మున్నగు వికలాంగులెల్లరు రాట్నము వడకవచ్చును. రాట్నము వడకుట గిట్టుబడి వ్యాపారము కాదని కొందరు వాదించుచున్నారు. నిజమే రాట్నము వడుకుట గిట్టుబడివ్యాపారమని ఎవరును అనలేదు. దానివల్ల రోజుకు 0-1-3 పైసలకంటె ఎక్కువరాదు. కాని హిందూదేశ ప్రజల సగటు ఆదాయము ఎంతో తెలియునా? అది రోజుకు 0-1-9 మాత్రమే, అదికూడ కోటీశ్వరులయొక్కయు లక్షాధికారులయొక్కయు ధనముకూడ కలుపుకుంటేనే అణా తొమ్మిదిపైస లగుచున్నది. కాబట్టి యీ సగటు సంఖ్య 0-1-9 రావలెనన్నచో అంతకు తక్కువ ఆదాయము గలిగినట్టిగాని అసలాదాయమే లేనట్టిగాని జనులు కోట్లకొలది కలరని తెలియుచున్నది. కావున యిట్టి ప్రజలకందరకు తమయిల్లు కదలకుండనే 0-1-9 ఆదాయము కలి

గించు రాట్నపరిశ్రమ నిజముగ దండుగ వ్యాపారమా ? మనకు అపారమగు జనసంఖ్యగలదు. ఆసంగతిని మనము గమనించవలెను. అసంఖ్యాకులగు యీజనులందరు నూలువడికి ఖద్దరుత్పత్తి చేసినచో పాశ్చాత్యుల యంత్రసామగ్రి మనల నేమియు చేయజాలదు.

పూర్వకాలములో ప్రత్తియేకుల నొడుకుటయే కాక నారనుకూడ వడికెడువారు. దానివల్ల అనేకమంది గ్రామస్థులకు జీవనాధారముండెడిది. బంగాళాదేశములో జనపనార గోగునార వడికి సంచులు నేసెడివారు. అట్లే పట్టు ఒడుకుట నేయుట వలనకూడ చాలమంది జీవించుచుండెడివారు. 1850—51 సంవత్సరములలో చేతితో వడికిన గోగునార బంగాళాదేశములో గొప్ప ఉపవృత్తిగా ఉండెనని "రే" పండితుడు చెప్పుచున్నాడు. ఆ సంవత్సరమే కలకత్తా రేవునుండి రు 21,59,732 రూపాయిల ఖరీదుగల జనపనార సంచులును వస్త్రములును ఎగుమతి అయినవి. బీహారు జిల్లాలోని ఒక్క పాట్నాపట్టణములో 2,30,426 మంది వడుకువారు ఉండిరి. ఒక్కొక్కరు సాలుకు రు 7-2-8 పైసల ఖరీదుగల దారమును తీయుచుండిరి. జిల్లా మొత్తముమీద రు 23,67,277 రూపాయిల విలువగల దారము ఉత్పత్తియగుచుండెను. ఈ మొత్తములో సగము ప్రత్తి వగైరాలక్రింద

పోయినను మిగతా సగము పడుకువాండ్రకు కూలిగా నిచ్చు చుండెను. ఈవృత్తిలో అన్ని జాతులవారును గలరు. బీహారు రాష్ట్రములో పడుకువారందరు హిందువులును, నేయువారందరును మహమ్మదీయులు నై యున్నారు. ఈరీతిగ హిందూ మహమ్మదీయులు పరస్పరసహకారులుగా నున్నారు. నాల్గు వేల జనాభాగల గ్రామము తనకు కావలసిన వస్త్రము తన గ్రామములోనే ఉత్పత్తిచేసుకొన్నచో ఎట్లుండునో యోచించుకొనుడు. సగటున మనిషికి సాలుకు 13½ గజముల గుడ్డ కావలసియుండును. గ్రామ మొత్తముమీద 54,000 గజముల గుడ్డ కావలెను. దీని ఖరీదు 27,000 రూపాయిలగును. దీనిలో మూడవవంతు మన దేశములో ప్రత్తి ఖరీదుక్రింద తీసివేసినచో మిగతా పదునెనిమిదివేల రూపాయిలు నేత, పడుకుకూలి, ఎగుమతి, దిగుమతులఖర్చు వర్తకలాభములక్రింద పోవుచున్నది. గ్రామస్తులే తమతీరిక సమయమునంతను యీపనులక్రింద వినియోగించి ఈ 27,000 రూపాయిలను గ్రామములోనేయుంచుకొన్నచో ఎంతబాగుండును. వృధాగాపోవు తీరికసమయమునంత నిట్లు వినియోగించుట దోషమగునా ? ఇది ఆర్థికముగా పండుగ వ్యాపారమనిగాని దేశాభిమాన రహితమనిగాని ఎవరయిన అనగలరా? ఈరీతిగ గ్రామము ప్రతిసాలున రు 27,000 నిల్వచేసుకొన గల్గుచో దేశమెంత భాగ్యవంతమగునో

యోచించుడు. పూర్వమిట్టి పరిస్థితులుండుటవల్లనే గదా భారతవర్షము సర్వసంపదలతో తులతూగుచుండెనను మాట ప్రఖ్యాతమైనది. ఇప్పుడిట్టి పరిస్థితులు లేకుండుటవల్లనే భారతదేశమిప్పుడు ఒట్టి కటిక దారిద్ర్యములో మునిగియున్నది.

•

జీవితమున కన్నవస్త్రములు ప్రధానములు. తక్కినవన్నీ అలంకారమాత్ర భోగములు. ఇట్టి అన్నవస్త్రములను స్వయముగా ఉత్పత్తిచేసుకొనలేని దేశము నిజముగా నాగరిక దేశమని చెప్పజాలము. భారతదేశము అనాదినుండియు నాగరికతగల దేశమని సీమలో సామ్రాజ్య వర్తకసంఘమువారొక కరపత్రము నీమధ్య ప్రచురించిరి. హిందూదేశములో క్రీ॥ పూ॥ 349 సం॥లో నరిపంట యుండినటు లీకరపత్రిముననే కలదు. కాని నేత పరిశ్రమ యింతకుపూర్వము నుండియు, హిందూదేశమున ప్రబలి యుండినట్లునూ, రాట్నము మగ్గముల వల్లనే అత్యద్భుతమగు వస్త్రములు తయారు చేయబడుచుండినట్లును అనేక నిదర్శనములు కలవు. మరమగ్గము అనునది పాశ్చాత్యదేశములలో యిటీవల 1765 సంవత్సరమున మాత్రమే కనిపెట్టబడినది. అది మన ఇండియాలో ముప్పది సంవత్సరముల క్రిందట యీశతాబ్దారంభముననే ప్రవేశపెట్టబడినది. దానివల్ల పూర్వమున్న చేమగ్గములకంటె రెండుమూడు రెట్లవరకు ఉత్పత్తియగుచున్నది. తన దేశమునకు కావలసిన వస్త్ర

ములను సుత్పత్తిచేసుకొనలేని దౌర్భాగ్యస్థితి గత ఐరోపా మహా సంగ్రామ కాలమందు మన హిందూదేశమునకు తటస్థించెను. వస్త్రముల ధరలు విపరీతముగా పెరిగెను. వస్త్రములు కొనుక్కొని మానము కాపాడుకొను శక్తిలేక చాలమంది ఆత్మహత్యలు కావించుకొనినట్లుకూడ వినియున్నాము. నేత వృత్తి భారతదేశమందనాదినుండి నేటివరకును కలదు. దీనిని గాంధిమహాత్ముడు నూతనముగా కనిపెట్టలేదు. కాని యీ మధ్యపోయిన రాట్నమును మాత్రము గాంధిమహాత్ముడు పునరుద్ధరించెను. 1905 లో చెలరేగిన బంగాళా విభజనాందోళనకు పూర్వమే మరమగ్గము ప్రవేశపెట్టబడినప్పుడు ఇండియాలో 60 లక్షల చేమగ్గము లున్నట్లు హావెల్ మున్నగువారు లెక్కవేసిరి. వీనిలో నాల్గవవంతు దక్షిణహిందూస్థానమందే యుండెను. ఇక రాటములు 5 లక్షలయినా ఉండియుండవలెననుట అతిశయోక్తికాదు. సగటున గంటకు బాగా వడకగల మనిషి మంచి పురిగల 10, 20 నెంబరుగల నూలును 300 గజములు వొడకగలడు. రోజుకు ఆరు గంటలు వడికినయెడల 1680 గజముల నూలువచ్చును. అనగా నెలకు 4 పౌనుల బరువుగల నూలు తయారగును, సాలుకు 48 పౌనులగును. ఒక పౌను నూలునుంచి నాల్గు చతురపుగజముల గుడ్డవచ్చును. 48 పౌనులనుండి 192 చతురపు గజములగుడ్డ వచ్చును. దీనిని

బట్టి అయిదులక్షల రాటములవల్ల 96 లేక 100 కోట్ల చతురపు గజములగుడ్డ ఉత్పత్తియగును.

1906 లో ఇండియాకు దిగుమతియైన వస్త్రములు 107 కోట్ల గజములు మాత్రమే యనుసంగతిని గమనించవలెను. 1914 లో అనగా ఐరోపా సంగ్రామము ప్రారంభ మయిన సంవత్సరమున యీదిగుమతులు గ 320 కోట్లకు హెచ్చెను. కాని 1922 లో 167 కోట్లకు తగ్గెను. కాబట్టి దేశములోనున్న రాట్నము లన్నిటిని పనిచేయించి నచో పరదేశములనుండి దిగుమతియగు వస్త్రముల నన్నిటిని పూర్తిగా నిలుపుజేయవచ్చును.

రాట్నమును గురించియు ఖద్దరును గురించియు చెప్పి నపుడు మిల్లుబట్ట నేల యుపయోగించరాదని విద్యాధికులు వాదింతురు. ఇట్టి కువాదములు మనదేశమునకు క్రొత్తకాదు. కేవల యుక్తివాదన, మనుష్యులను కేవలము తార్కికులునుగను, కువాదన పరులనుగను, చేసినదేగాని వారియందు కార్యదీక్ష తను పెంపొందించుటలేదు. అట్లే శారదాబిల్లును గురించి చెప్పినపుడు పిల్లలకు చిన్నతనమందే పెండ్లిండ్లుచేసి అవసర మయినచో వితంతు వివాహము లేల చేయరాదని కొందరు బుద్ధిమంతులు వాదించుచున్నారు. ఈవాదన పైకి చక్క-

గనే కన్పించుచున్నది. తాత్కాలికముగా దాటుకునిపోవుట కిది చక్కని యుపాయమే. కాని క్రియవచ్చినపుడు మాత్రము వితంతు వివాహము చేయుటకు వీరెవ్వరును యొప్పుకొనరు. కాంగ్రెసు తీర్మానము ప్రకారము మిల్లుబట్ట నిషేధింపబడ లేదు. నాల్గయిదురకముల స్వదేశవస్త్రములు పైన వివరింపబడినవి. ప్రస్తుతము ఖద్దరుకొనలేని పేదవారున్నచో వారు ఇండియామిల్లులలో వడకబడిననూలుతో ఇండియాదేశపు మిల్లులపై నేసిన బట్టలను కట్టవచ్చును. కాని ఇట్టిమినహాయింపులను నిజముగా బీదలగువారికేగాని భాగ్యవంతులయి పాశ్చాత్య యంత్ర నాగరికత నిక్కడ ప్రవేశపెట్టు వారికొరకుకాదు. యంత్రములు పూర్తిగా నిషేధింపవలెనని కాదు. అట్లయినచో బంగాళాదేశములో రసాయినకాది అనేక యంత్రపరిశ్రమలను నెలకొల్పిన "రే" పండితుడు నిజముగా దేశాభిమాని యని చెప్పబడజాలడు. గాంధిగారు మోటారుకారులో ప్రయాణము చేయనూ కూడదని చెప్పవలసివచ్చును. పరిశ్రమలలో రెండు రకములుగలవు. యంత్రసహాయమువలన పెంపొందింపదగినవి ఒకరకము. కేవలము హస్తనైపుణ్యముచే వెలయగలవి యింకొకరకము. హస్తనైపుణ్యముచే తయారగు వస్తువులే నిజమగు శోభను సంపదను యివ్వగలవు. తనప్రత్యేక వ్యక్తిత్వమును కళాకౌశలమును ప్రచురపరచు కళలు, వృత్తులు

కలిగిన దేశమే నిజముగా నాగరిక దేశమనబడును. ప్రపంచమునం దేదేశమునకైన వెళ్లిచూడుడు; ఆదేశ ప్రజల హస్తలాఘవమును కళానైపుణ్యమును ప్రచురపరచు దేశీయనాగరికతకు ప్రత్యేక వ్యక్తిత్వమును గౌరవము నొసంగుచున్నవి. దూరపు ప్రయాణములను శీఘ్రముగా చేయుటకు మోటారుకార్ల నుపయోగింపవచ్చును, కాలువలనుండి నీటిని పయికి ఎత్తి సాగుచేయుటకు పంపుల నుపయోగింపవచ్చును, రాళ్లు పగులగొట్టుటకు యంత్రముల నుపయోగింపవచ్చును, కాని తివాచీలు నేయునప్పుడు, వస్త్రముల నేయునపుడు చక్కని అద్దకముల నద్దునపుడును యంత్రములు పనికిరావు. దీనికొరకే మనమిప్పుడు ప్రయత్నము చేయుచున్నాము. ప్రస్తుతము ఇండియాకంతకు మిల్లుబట్ట సప్లయిచేయుటకూడ సాధ్యము కాని పని, కాని ఖద్దరు విషయమయి అట్లుకాదు. రాట్నముతో పనిచేయుటకు నాల్గణాల ఖరీదుగల ఏకులుతప్ప వేరే పెట్టుబడి అవుసరములేదు. అట్లే మగ్గమునకుకూడ మూడు రూపాయిల ఖరీదుగల నూలుకంటె ఎక్కువ పెట్టుబడి అవుసరములేదు. ఇక నేతకు సంబంధించిన కళానైపుణ్యము కావలసినంత యున్నది. దానిని చూచువారు లేక నశించుచున్నది. దానిని సక్రమమార్గమున అభివృద్ధిపరచినచో అదియంతయు మనకు బంగారు గని యగును. ఇప్పటికిని ఇండియాకు కావల

పీన బట్టలో మూడవవంతు చేతిమగ్గములవల్లనే సప్లయియాగు చున్నదను విషయము ఎల్లరంగీకరించియున్నారు. చేమగ్గములు మిల్లులకంటె ఎక్కువ సప్లయి చేయగలవను సంగతిని ఇ. బి. హావెల్ అను ఆంగ్లేయుడే ఖండితముగా చెప్పియున్నాడు. ఇందతిశయోక్తి యెంతమాత్రములేదు. ఏలననగా యంత్రములుపుట్టి ఇప్పటికి నూట అరువదియేండ్లయినను ఇండియాలో అన్నికలిపి 201 యంత్రములకంటె ఎక్కువలేవు. ఒక్కొక్క యంత్రముకొరకు సగటున నలుబదిలక్షల రూపాయిలు పెట్టుబడి పెట్టబడినది. ఇండియాలో సగటున జిల్లాకొక మిల్లుకలదు. ఒక్కొక్కమిల్లులో రోజుకు 4800 పౌనుల, అనగా 1500 గజములగుడ్డ తయారగుచున్నది. ఇండియాలో మనిషి ఒక్కంటికి సాలుకు 13½ మొదలు 15 గజముల వరకు గుడ్డ కావలయును. ఈలెక్క ప్రకారము ఒక మిల్లు సాలుకు 30,000 మందికి కావలసిన వస్త్రమును సప్లయి చేయగలదు. కాబట్టి పది లక్షల మందికి బట్ట సప్లయి చేయవలెనన్నచో మూడు మిల్లులు కావలయును. ఇండియాలోనున్న 32 కోట్లమందికి బట్టలు సప్లయిచేయుటకు 260 మిల్లులు కావలెను. సామంత సంస్థానములుపోను మిగతా ఇండియాలో 350 జిల్లాలు గలవు. పైలెక్కప్రకారము జిల్లాకు మూడు మిల్లులకు తక్కువయుండరాదు. అనగా రెండు మూడు తాలూ

కాలను కలిపి ఒక మిల్లుండవలెను. ఒకమిల్లుకు కావలసిన నలుబది లేక ఏబది లక్షల రూపాయిలు రెండుమూడు తాలూకాలలో ఎట్లు సమకూడగలవు. ఒకవేళ యీడబ్బు వచ్చుననుకొన్నను దీనిని వసూలు చేయుటకు 10 సంవత్సరములు పట్టును. సీమకు యంత్రములకొరకు ఈరోజున ఆర్డరిచ్చినచో 2½ సంవత్సరములకుగాని ఆయంత్రము తయారుగాదు. అది ఇండియాకువచ్చి దానిని సరిగాబిగించి పని ప్రారంభించునప్పటికి కనీస మింక రెండేండ్లయినను పట్టును. కాబట్టి నలుబది లక్షల రూపాయిలు చేతనున్నను మిల్లుపని ప్రారంభించుటకయిదేండ్లుపట్టును. మిల్లుపని ప్రారంభించినప్పటినుండి దాని రోజువారి ఖర్చులకు సొమ్ము ఎట్లుదొరకునా యనునది పెద్ద సమస్యయగును. సరుకు ఎట్లు విడుదలచేయవలయును. ఇదివరకే పేరు ప్రఖ్యాతులుపొంది సుస్థిరముగా పాతుకొనియున్న కంపెనీలతో ఎట్లు పోటీకి నెగ్గవలయును అను సమస్యలు దుస్సాధ్యములగును. రెండుమూడు తాలూకాలనుండి డబ్బు నిరాటంకముగా ప్రవహించునని యూహించుకొనినచో యీ సమస్యలనన్నిటిని గడచి బ్రదుకుటకు పదేండ్లుపట్టును. కాని రెండు మూడు తాలూకాలనుండి యింతసొమ్ము నిరభ్యంతరముగ దొరకుటే దుర్ఘటకార్యము. ఈలోగా నిరంతరము మార్పునొందుచుండు యంత్రముల పోటీలో మనమిల్లు వెనుక

పడక తప్పదు. రోజురోజు క్రొత్తరకపు యంత్రములు పుట్టు చుండుటవలన మనయంత్రము పాతదై క్రొత్తవాని పోటీకి తాళలేదు. అందుచే కించిత్తేమయిన లాభమున్నను అదికాస్తా నున్నచుట్టుకొనిపోవును. ఒకవేళ ఇన్ని అవాంతరములు గడ చినను లాంకషైరు బట్టలీవర్తకుల కిచ్చు డబ్బును బర్మింగు హాము యంత్రశాలలవారి కిచ్చినట్లగును. దీనిలో మనకేమి లాభమున్నది. ఇవన్నీగాక ఇంకో గొప్పఅవాంతరముకలదు. మూలధనము దొరికి, నమ్మకమయిన యంత్రమును సీమవాడు మనకు పంపి, దాని నిక్కడ సరిగా యమర్చి, పని చక్కగా జరుగుచున్ననూ కూలీల సమ్మెలభయ మొకటికలదు. గతసంవ త్సరము ఈసమ్మెలవల్ల బొంబాయిమిల్లులు సంవత్సరములో 6 నెలలే పనిచేసినవి. ఆర్థిక, యంత్ర, విషయములలో మిల్లుల గతి యిట్లున్నది. ఇక నైతికవిషయములో మిల్లులవల్ల కళా కౌశలము, నిర్మాణశక్తి నశించుచున్నది. కుటుంబములయొక్క గౌరవము నశించి సంసారములు నశించుచున్నవి. భార్యా భర్తలు వేరువేరు మిల్లులలో పనిచేయుచుండుటచే వారినీతికి భంగము కలుగుచున్నది. పసిపిల్లలు యంత్రముల రణగొణధ్వ నులమధ్య, అపరిశుద్ధ స్థలములలో, జొరెలలో పెరుగుటచే, యనారోగ్యవంతులగుచున్నారు. తన హస్తలాఘవముచే ఒకా నొక వస్తువును సంపూర్ణముగా సర్వాంగసుందరముగా తన

చేతితో తాను స్వయముగా నిర్మించు శిల్పికి కల ఆనందము సంతృప్తి మిల్లులో ఒకేభాగమందు పనిచేయు కూలివాని కెట్లు కలుగును.

నేత పరిశ్రమకు ఉపాంగముగా అద్దకముమున్నగు ఆనేక ఉపవృత్తులు ఉండెడివి. వీటివల్లనే నేతవృత్తికి స్థిరత్వ మేర్పడినది. ఆయాకులములవారికి ఆయాప్రాంతములవారికి, వారివారి అభిరుచుల కనుకూలమగు విధముగా రంగులు, అద్దకములు ఉండెడివి. ముప్పది రెండుకోట్ల జనముకలిగి 18 లక్షల చతురపుమైళ్ల వైశాల్యము గలిగియున్న భరతఖండములో ఎన్నిరకముల అభిరుచులు ఎన్నిరకముల రంగులు, ఎన్నిమాదిరీల అద్దకములు గత అయిదువేల సంవత్సరములలో ఉద్భవించెనో సులభముగా యూహింపవచ్చును. ఏదేశము యొక్క నాగరికమునకుగాని, ఆదేశపు ప్రజల హస్తనైపుణ్యముచే నిర్మింపబడిన శిల్పకళాదులే చిహ్నములని చెప్పినమాట ముమ్మాటికి నిశ్చయము. ఇట్టి హస్తలాఘవము భారతీయులగు నేతగాండ్రచే అత్యద్భుతముగా ప్రదర్శింపబడినది. ఇట్టి అత్యద్భుతమహిమ పాశ్చాత్యుల ఊహకుకూడ అందరానిదైనది. కేవలము వడుకు నేతకూలిని మాత్రమే మనమీ దేశములో యుండజూచుకొనునెడల మనదేశమునుండి బట్టలకొరకు నూలు కొరకు పోవు 72 కోట్ల రూపాయిలలో 40 కోట్ల రూపాయిలు

లను నిలిపివేయవచ్చును. ఈడెబ్బదిరెండు కోట్లలో, మూడవ వంతు మనము నష్టయిచేసే పత్తికిగ్గింద నే లెక్కవేయవచ్చును. కావున దిగుమతులు, మిగతా రెండువంతులు మాత్రమే యని చెప్పవచ్చును. అనగా 48 కోట్ల రూపాయిలు. వీనిలో ఓడ కేవులు, వర్తకలాభములకిగ్గింద 8 కోట్లు తీసివేసినచో దిగు మతుల నికరం విలువ 40 కోట్లని చెప్పవచ్చును. ఈ 40 కోట్లు సీమసరుకుకు బదులుగా మనము 40 కోట్ల రూపాయిల ఖరీదుగల ధాన్యమును ఎగుమతిచేయుచున్నాము. ఇండియా తనకు కావలసిన దానికంటె ఎక్కువధాన్యమును పండించు చున్నదని యింగ్లండులో సామ్రాజ్య వర్తకసంఘమువారిచే ప్రచురింపబడిన కరపత్రమునందుకలదు. ఈలెక్క సరియయి నదికాదు. ఏలననగా ఇండియాలో అయిదవవంతు జనమునకు ఒక్కపూట తిండియే కలదని సర్ చార్లెస్ ఇలియట్, సర్ విలియం హంటర్ మున్నగు ఆంగ్లప్రముఖులే వక్కాణించి యున్నారు. ఈలెక్కప్రకారము 6 కోట్లమందికి రెండవ పూట తిండిలేదని తెలియుచున్నది. గోదావరియొడ్డున రాజ మహేంద్రవరమున్నది. మితములేని నీరు వృధాగా సముద్ర ములోనికి పోవుచున్నది కాని ఒడ్డుననున్న 52 వేల జనము త్రాగుటకు ఒకబొట్టయినను లేక అల్లాడుచున్నారు. ఎందు వల్ల? ఆనీటిని మునిసిపాలిటీవారు ప్రజల ఇండ్లదగ్గరకు వచ్చు

న క్లేర్నా శేమియు చేయలేదు. హిందూదేశపు ప్రజల స్థితికూడ నిక్లేయున్నది. | ఇండియాలో పండుధాన్యము పెద్దకాలునలుగట్టి పరదేశములకు ప్రవహించి పోవుచుండగా ఒడ్డుననున్న కోట్ల కొలది జనము తినుటకు తిండిలేక మాడుచున్నారు. ఎందువల్ల? ఆధాన్యమును కొనుక్కొనుటకు తగినంతడబ్బు ప్రజలచేతులలో లేకుండా గవర్నమెంటు చేయుచున్నది. ధాన్యము దేశములో కావలసినంత యున్నది తిండిలేక మాడేవారు కావలసినంతమ ందయున్నారు. ఈరెంటిని సంబంధపరిచేవారు మాత్ర మెవరూలేరు.

నేతవృత్తిని పునరుద్ధరించి ఇండియానుండి బట్టల మూలముగా పరదేశములకు పోవుచున్న 40 కోట్ల రూపాయిల విలువగల ధాన్యమును దేశములో నిలుపుకొనగలిగిన యెడల ప్రజలు తిండిలేక మాడ నవసరముండదు. రు 40 కోట్ల ధాన్యము పరదేశములకు పోనవసరమునూ యుండదు. ఇంకొక విషయము 100 రూపాయిల ఖరీదుగల మిల్లుబట్టలలో 71 రూపాయి పెట్టుబడిదారునికి పోవుచున్నది. 29 రూపాయిలు మాత్రము కూలివానికివచ్చుచున్నది. కాని 100 రూపాయిల ఖరీదుగల ఖద్దరులో 79 రూపాయిలు ఒడుకువారికి నేయువారికి పోవుచున్నది. తక్కిన యిరువది ఒక్కరూపాయి మిగత ఖర్చుల క్రింద పోవుచున్నది. ఒకరూపాయి ఖరీదుగల

ఖద్దరులో యీ క్రింది విధముగా ఖర్చులగును.

| | |
|---|---|
| నడుకువానికి | 0–3–9 |
| నేతగానికి | 0–4–9 |
| ప్రత్తికి | 0–3–9 |
| ఏకులకు | 0–2–0 |
| నాన్పుటకు | 0–0–6 |
| అమ్మే వర్తకునకు | 0–1–0 |
| రవాణా ఖర్చులకు | 0–0–3 |
| | 1–0–0 |

ఈరీతిగా ఖద్దరు పరిశ్రమవల్ల అనేక ఉపవృత్తులు పోషింపబడుచున్నవి. అనేకమంది పనివాండ్రకు అన్న మేర్పడుచున్నది. మనదేశపు ఆర్థికవిషయములలో ఇవి ఎల్లరు గ్రహింపవలసిన ముఖ్యవిషయములు. ఈ ఆర్థికతత్వమును, మనమిపుడు క్రొత్తగా కనిపెట్టినామని చెప్పవచ్చును. ఇందలి రహస్యము పాశ్చాత్యుల కెవరికిని అర్థముకాదు. మనలో చాల మంది కూడ దీనిని గుర్తెరుగరు. సహకార సంస్థలవల్లనే అన్ని వృత్తులు పోషింపబడుచున్నవి కాని యీరాజధానిలో గల 33 వేల నేతగాండ్రకు 63 సహకార సంఘములు మాత్రమే యుండుట కడుశోచనీయము. నేతగాండ్రకు సహాయము

చేయుటకై యింతవరకు తీసుకొన్న చర్య చాల తక్కువగా నున్నదని టవున్సెండు కమిటీవారు చెప్పియున్నారు. ఖద్దరు సంఘములకు, నేతసంఘములకు, ఎక్కువ ప్రోత్సాహమిచ్చుటకుగాను, కో ఆపరేటివు బ్యాంకులవారు యీసంఘములకు ప్రత్యేక సౌకర్యముల నియ్యవలసినదన్ని మదరాసు రాష్ట్రీయ సహాకారసభవారు హెచ్చరించియున్నారు. ఇట్టి కుటీర పరిశ్రమల పోషించుట అత్యావశ్యమను భావము ప్రజలలో నానాట హెచ్చుగుచున్నది. అదిగాక యంత్ర పరిశ్రమలు లోకమునకు కొంతవరకే తోడ్పడగలవు గాని అవి పూర్తిగా తోడ్పడజాలవని ప్రాచ్యఖండవాసులు క్రమముగా గ్రహించుచున్నారు. పాశ్చాత్త్యులకుకూడ ఈసంగతి క్రమముగా తెలిసి వచ్చుచున్నది. రాళ్లు పగలగొట్టుటకు, బరువుల నెత్తుటకు, దూరదేశములకు పోవుటకు మున్నగువానికి యంత్రబలము పనికివచ్చినను మానవుల కళాకౌశలమును, హస్తలాఘవమును రూపుమాపుటకు యంత్రములకు చోటివ్వరాదని పాశ్చాత్త్యులు కూడ నెమ్మదిగా గ్రహించుచున్నారు. వస్తుసామగ్రిని కావలసినదానికంటె విపరీతముగ హెచ్చుగా యుత్పత్తి చేసి, వానిని పరదేశములనెత్తిపైవేసి రుద్దుట యెంతమాత్రము పనికిరాదు. పరదేశముల కెగుమతికై హెచ్చు వస్తుసామగ్రిని సృష్టించుటయు పనిలేనివారికి పనిచూపించుటకై హెచ్చు

వస్తుసామగ్రిని నిర్మించుటయు, నక్కతోకను తానుకరచుటకై గిరగిర తిరిగినట్లగుచున్నదని పాశ్చాత్య ఆర్థికవేత్తలిప్పటికి గ్రహించినారు. పాశ్చాత్యపారిశ్రామిక నాగరికత నేడు కనిపెట్టినదానిని రేపు రూపుమాపవలయునను సిద్ధాంతముపై నాధారపడియున్నది. ఎట్లనగా పూర్వపు యుద్ధనావ, ఇటీవల కనుపెట్టబడిన క్రూయిజరు నావచే కొట్టివేయబడెను. పిమ్మట క్రూయిజరునుమించిన డ్రెడ్ నాటువచ్చినది. దానిని మించునది సూపర్ డ్రెడ్ నాటు వచ్చినది. వీనినన్నిటిని మించినదైన జలాంతర్గామియను నావవచ్చినది. దీనిని ముంచి వేయునదగు టార్పెడో వచ్చినది. ఈవిధముగా ఒకదాని నాశనముచేయునది మరొకటి పుట్టినది. ఇదేరీతిగా మోటారు కారులలోకూడ ఏడాదికొక క్రొత్తరకము పుట్టి పాత దానిని త్రోసివేయుచున్నది. సింగరుకుట్టుయంత్రముల కంపెనీ వారు పాతయంత్రములభాగములను వసూలుపరచి వాటిని సముద్రములో పారవేయుదురట. ఎందువల్లననగా పాతయంత్రములకు సరిపోవుభాగములు దొరకనియెడల అందరు తిరిగి క్రొత్తవే కొందురుగదా! వేయేల, పాశ్చాత్యనాగరికతయంతయు సంపూర్ణ కళావిలాసముతో నొప్పు సర్వాంగసుందర వస్తుసముదాయముగాక విడివిడి ముక్కలపై వికలాంగములపై నాధారపడియున్నది. నిర్మాణశక్తిపైగాక విచ్ఛిన్నశక్తిపై

నిలచియున్నది. అందువల్లనే సీమలో అతివిశాలమగు భూభాగములు ప్రజల కన్నవస్త్రములకిచ్చు పంటలకొరకుగాక ప్రభువులు మృగములవేటాడు అరణ్యములుగా వదలివేయబడినవి. ఈరీతిగ దేశమంతను ప్రభువులు వేటాడు కేళీవనముల క్రింద వదలివేసి తిండికై ప్రజలు పరదేశములపైబడి పీకుకుతినునట్లు చేసిరి. ఇంగ్లండు తనకు కావలసిన ధాన్యము ఇండియానుండియు, గోధుమలను రష్యానుండియు, మాంసమును ఆస్ట్రేలియానుండియు, పాలు పెరుగు మొదలగు పాడిద్రవ్యములను హాలెండు, బెల్జియము, డెన్మార్కు దేశములనుండియు, ఇటీవల కోడిగుడ్లను లక్షోనుండియు, తెప్పించుకొనుచున్నది. తమఅన్నవస్త్రములకై పరదేశములపై యాధారపడుట తమకు క్షేమకరముకాదని ఇంగ్లండిప్పుడిప్పుడే గ్రహించుచున్నది. ఏతప్పునైతే దిద్దుకొనుటకు ఇంగ్లండిప్పుడు ప్రయత్నించుచున్నదో అట్టితప్పునే మన ఇండియాదేశమిప్పుడు చేయకుండుగాక. చేతితోవడకి చేతితోనేసిన వస్త్రములను నార్వేస్వీడెను దేశములిప్పుడు విరివిగా నుత్పత్తిచేయుచున్నవి. అట్టివస్త్రముల బేలునొకదానిని సబర్మతీ ఆశ్రమములో గాంధిగారిదగ్గర చూచినాను. ఆవస్త్రములు అన్నివిధముల చాలాబాగున్నవి. పాశ్చాత్యులు వేనినైతే పనికిమాలినపని వదలిపెట్టుచున్నారో అట్టి పనికిమాలినవానిని

(యూనివర్సిటీలు, మిల్లులు మున్నగు) మనము చేపట్టుచున్నట్టి మన దౌర్భాగ్యముకాదా ?

ఖద్దరువిషయములో యింకొకవాదన ఏమనగా ధర ఎక్కువని. ఖద్దరు చాలా ప్రియమనియు, చవుకగానున్న యెడల కొనుక్కొనుటకు మాకెట్టి అభ్యంతరము లేదనియు కొందరందురు. ఈవాదనచెప్పువారు ఎంతఅమాయికులో వేరుగ చెప్పవలెనా. ఖద్దరు సీమబట్టంతకాని, అంతకు తక్కువ గాని చవుకయయిన యెడల ఖద్దరును వ్యాపకముచేయుటకై గాంధివంటి మహాత్ముడు, కాంగ్రెసువంటి జాతీయమహాసంస్థ వేలకొలది దేశాభిమానులు కావలెనా ? వీరందరు తమశక్తిని కాలమును వృధపుచ్చి యీఖద్దరు వ్యాపకమందు పనిచేయవలెనా ! నీరు మెరకనుండి పల్లముకు ప్రవహించును. అట్లే కొనువారుకూడ ప్రియమైనవస్తువులనుండి చవుకయైన వస్తువులకే పరుగిడుదురు. 18-19 శతాబ్దములలో ఇంగ్లీషువారు ఇంగ్లండులో మనబట్ట అమ్మకమునకు వీలులేనంత హెచ్చుగా పన్నులు విధించి ప్రియముచేసిరనియే మనము ఘోషించుచున్నాము. ఇండియాలోకూడ ఇంగ్లీషువాడుచేసినపనియేఅది. తనసీమబట్టకంటె మనబట్టను ప్రియముచేసినాడు. అందుచే మనస్వదేశపరిశ్రమ మాయమైపోయినది. ఇట్టిసందర్భములో సీమబట్టకంటె ఖద్దరు చౌకఅయినయెడల కొనెదనని చెప్పుట

మిక్కిలి హాస్యాస్పదము. ఇంకొక విషయము. ఏవస్తువైనను విరివిగా ఉత్పత్తియైనకొలది అది చౌకయగుచుండుననుమాట ఎంతమందబుద్ధికైనను గోచరమగును. ఈఖద్దరు పుట్టిన ఎనిమిదేండ్లలో అది నానాటికి చౌకయగుచు రాలేదా ? మొదటి రోజులలో 25 నెంబరు. ఖద్దరు గజం 1కి 1-2-0 చొప్పున అమ్ముచుండెడివారము. దానినే యీనాడు 0-11-0 అణాల కమ్ముటలేదా ? ధర మూడవవంతుకుమించి తగ్గలేదా ? ఖద్దరు విరివిగా వాడినకొలది దానిధరకూడ తగ్గుచుండును. ఈసూత్రమును ఎవరూ కాదనజాలరు. నీవుఖద్దరుకట్టవు. ఇతరులను కట్టనియ్యవు. ఎవరో స్వంతఖర్చుమీద కష్టనష్టముల భరించి తయారుచేసినప్పుడు ఏదో గారడీవల్ల నీకు నోరూరునంత చవుకగా దానిఖరీదు తగ్గునరకు యూరకుని అప్పుడు కొంటానంటావు. నీకు నోరూరునంత చౌకగా యున్నప్పుడు అందు నీబుద్ధిపూర్వక ప్రయత్నమేమున్నది. నీవేమికష్టపడినావు. నీత్యాగమెక్కడనున్నది. అందు నీదేశాభిమానమేది.

ఖద్దరు ప్రియమనువాదము నిజముగా నిజాయితీయైన వాదముకాదు. ఏలననగా ఖద్దరు ప్రియమని వాదించు పెద్దమనిషియే ఎంతటిఖరీదుగల దుస్తులను ధరించియున్నాడో చూడుడు. ఆయననెత్తిమీది తలపాగా పది యిరువైరూపాయిలకు తక్కువయుండదు. ఆయనధరించిన మొకేనాకోటు 20-30

రూపాయిలవరకుండును. దానిని కుట్టుటకుకూలి ఆరురూపాయి లయినా యిచ్చియుండును. ఆయనధరించిన సిల్కుషర్టు 6-10 రూపాయిలవరకుండును. దానికిపెట్టిన బంగారుగుండీలు చేతి లెంకెలు రెండునవరసులైనాయుండును. పైనవేసుకున్న సేలము సిల్కు ఉత్తర్యము 30-40 రూపాయిలుండును. కట్టు కున్న ధోవతి 8-10 రూపాయిల ఖరీదుండును. ఇవిగాక చేతికి పెట్టుకున్న బంగారురిస్టువాచి, బంగారు చేతిపట్టా, చెవిరాళ్లపోగులు, వేళ్లధరించిన రాళ్లఉంగరములు వీనినన్నిటిని కలిపి మనిషిని అమాంతముగా వేలమువేసినచో, మనిషిమినహా తక్కినవన్నియు కలిపి ఏరెండుమూడువందల రూపాయిల యినను వచ్చును. ఖద్దరు ప్రియమను వాదము కేవలము తార్కి కము మాత్రమే. ఈవాదము కేవలము పేదలకిపుడుమైచెప్పిన కొంతవర కర్థముండును. భాగ్యవంతులకు పేదలయందిట్టి అవ్యాజ కరుణఖద్దరుకు వ్యతిరేకముగా ఇట్టికువాదము చేయు సందర్భమందే పుట్టునుగాని యితరసమయములందు పుట్టదు. ఇక నిజమాలోచించినచో మొత్తమువీద ఖద్దరు నిజముగా చవుకయేనని చెప్పవలసియున్నది. మొట్టమొదట ఖద్దరులో ప్రవేశించినప్పుడు ఖరీదు ఎక్కువగనే కన్పట్టవచ్చును. భరింపలేనంత ప్రియముగనే కన్పింపవచ్చునుకాని సీమబట్ట కంటె ఖద్దరెక్కువ కాలము మన్నును. ఖద్దరు కట్ట నారంభిం

చినచో నీకుకావలసిన వస్త్రముల సంఖ్యకూడ తగ్గిపోవును. పూర్వమున్నన్ని బట్టలయవసరము కన్పించదు. ఖద్దరు నీమనస్సునందో నీయభిరుచియందో మార్పును కల్పించి ఇది వరకు అనవసరముగా నీవు దగిలించుకొనుచుండిన బరువుల చేటు దుస్తులనన్నిటిని తీసిపారవేయించి శరీర ఆరోగ్యమునకు గౌరవమునకు తగినంతవరకు మాత్రమే వస్త్రములధరించు నట్లు చేయును. అందుచే వెనుకటిఖర్చు చాల తగ్గిపోవును. మొత్తము మూడేండ్లమీద లెక్కచూచినచో సీమబట్టలు కట్టే కుటుంబములోకంటె ఖద్దరు కట్టే కుటుంబములోనే బట్టలకై తక్కువ ఖర్చగుననుటలో ఎట్టి సందేహమును లేదు. ఖద్దరు కట్టుకుటుంబమునకు ఎక్కువ ఖరీదుగల సిల్కులతో పనిలేదు. ఖరీదుగల ఫ్లానలు లక్కరలేదు. వేషభాషల యందు నిరాడంబరత క్రమముగా పెంపొందును. వెనుక నున్నట్టి ఖరీదుగల బట్టలుగాని అన్ని పెట్టెలబట్టలుగాని అవు సరములేకపోవుటచే చాల డబ్బుపొదుపగును. కేవలము తార్కిక వాదము చేయుటకంటె ఒకరెండుసంవత్సరముల పాటు ఈ పెద్దమనుష్యులు ఖద్దరు కట్టిచూచినచో ఇందలి తత్వము వారికే గోచరించితీరును. ఖద్దరు చవుకో ప్రియమో అప్పుడే వారికి బోధపడును. ఇక ఖద్దరు ప్రియమను విష యమై నేనొక చిన్న ప్రశ్న అడిగెదను. నిజమే ఖద్దరు

ప్రియమే, సీమగుడ్డచౌకే. కాబట్టి సీమబట్టకొనుక్కొనవలెనం టావు. మంచిది. ఉప్పువిషయమునకూడ నట్లేకదా? మన ఉప్పును ప్రియముచేసినారు. సీమఉప్పును తీసుకునివచ్చి మననెత్తిన రుద్దినాడు. సీమఉప్పును మనఉప్పుకంటె తెల్లగా స్వచ్ఛముగా చవుకగా చేసినాడు. సీమఉప్పును ఈరీతిగా మననెత్తిమీద వేయవద్దోయని మనము మొత్తుకొనుటలేదా? సరే అది అట్లాఉంచండి. ఓడలలో పూటీసరుకుక్రింద సీమ ఉప్పును ఇక్కడికెట్లుదిగుమతి చేయుచున్నది అందరికి తెలిసినవిషయమే. గతసంవత్సరము 5 కోట్ల రూపాయిల విలువ గల గోధుమలు ఇండియాకు దిగుమతియైనవి. ఇదిగాక రెండు కోట్లరూపాయిల ఖరీదుగల ధాన్యముకూడ ఇండియాకు దిగుమతియైనట్లు ఇండియా గవర్నమెంటు మెంబరు బ్లాకెట్ గారు తమబడ్జెటు ఉపన్యాసమున చెప్పినారు. ఇంగ్లండులో నిర్వ్యాపారసమస్య హెచ్చుగాయున్నది. ఆస్ట్రేలియాలో సాగుకు లాయకగు భూములు ఊరికే బంజరుగా పడియున్నవి. కాబట్టి సీమలో పనిలేక మాడుచున్న జనులందరు ఇకరేపటి నుండి ఆస్ట్రేలియావెళ్లి అక్కడిభూమిని సాగుక్రిందికితెచ్చి కావలసినంత ధాన్యమును పండించి మనధాన్యముకంటె చౌకధరకు మనఇండియాకెగుమతిచేయుదురు. ఈవిషయమై కర్నల్ ఎమరీయను నాంగ్లేయుడు ఇదివరకే పెద్దస్కీమును

వేసియున్నాడు. ఇంగ్లండులో పనిలేని నిమ్న జాతులుగాక మంచిడబ్బు గౌరవముగల ఉత్తమ మధ్యమ తరగతి కుటుంబములవారే ఆస్ట్రేలియాకు వలసపోవు స్కీము నతడు ఏర్పాటుచేసెను. వారందరు మంచి కండపట్టియున్న ఆస్ట్రేలియా భూములకు వెడలి తమ యంత్రములచేతను, ఇంజనులచేతను, పంపులచేతను సదరుభూమిని యావత్తు సాగుక్రిందికి తెచ్చినచో ఎంతధాన్యము ఉత్పత్తియగునో అది ఎంతచౌకగా గిట్టుబడియగునో దానిని తిరిగి కేవలము ఓడలపూటీసరుకు క్రింద ఉప్పు తెచ్చినట్లే తెచ్చి దౌర్భాగ్యుల మగు మననెత్తి మీదవేసి రుద్దినచో మనగతి యెట్లుండునో ? మనపంట భూములన్నియు ఏమయిపోవునో ఒక్కసారి ఆలోచించుకొనుడు. మనచేలోపండిన ధాన్యముకంటె పరదేశములనుండి దిగుమతియగు ధాన్యమే చౌకగా నున్నదని చెప్పి తరతరములనుండి తాము సేద్యము చేయుచున్న భూముల బాడుపెట్టి పరదేశములనుండి వచ్చు చౌకధాన్యముల కొనుక్కొందురా? ఈభూములనన్నిటిని రయితు లేమిచేసెదరు. వీనిలో రయితు లింకేమి పండించెదరు. వరిపైరును మానివేసి గంజాయి, నల్లమందు, పొగాకు, పండింతురా ? (అదియునూ వల్లగాదే) కాబట్టి ఖద్దరువిషయములో అన్నవస్త్రాదులవిషయములో చౌకక్రియను అనుమాట ఎంతమాత్రము పాటింపదగినది

కాదు. నిజమునకు మన అన్నవస్త్రాదులు మనకు ప్రియమైనను ప్రియమేకావలెను.

ఖద్దరును దేశాభిమానమునకు స్వరాజ్యమునకు పునాదిగా నిరూపించి చెప్పినప్పుడు కొందరుపెద్దలు ఇంకొక ప్రశ్న వేయుచున్నారు. స్వరాజ్యముకొరకు ఖద్దరుకట్టవలెనన్నయెడల ఒక్క బ్రిటిషువారి వస్తువులమాత్రము బహిష్కరించినచాలదా జపాన్, జర్మనీ, అమెరికాముస్నగు దేశములవారి వస్తువులను (వస్త్రములను) కూడ ఏల బహిష్కరింపవలెనని యడుగుచున్నారు. మనదేశమునకిప్పుడు నిజముగా వచ్చిన అనర్థకమిదే. విదేశవస్త్రబహిష్కారమువల్ల సీమలోని వస్త్రపరిశ్రమకు దెబ్బతగిలెననుటలో సందేహములేదు. దీనివల్ల ఇంగ్లీషువస్త్రపరిశ్రమ కెంత నష్టముకలిగెనో విదేశవస్త్రబహిష్కారసంఘమువారు ఈదిగువరీతిగా ప్రచురించుచున్నారు. "లంకషైరు వస్త్రపరిశ్రమకు సంబంధించిన అంకెలు నిరుటి సంవత్సరము ఆఖరురోజున ఈదిగువరీతిగా నున్నట్లు ఆంగ్లవిలేఖరి యొకడిట్లు వ్రాయుచున్నాడు. "1929 సం|| గడచిపోయినది. ఈసంవత్సరము ఉన్నంత హీనస్థితిగా లంకషైరు వర్తకమెప్పుడును లేదు. ఇట్టిపాడుసంవత్సరము గతించిపోయినందుకు వర్తకులెవరును చింతింపరు. ఈసంవత్సరము వర్తకము ఎంతమాత్రము సాగకేలేదు. [illegible] మిల్లులకు వేగముతో

లేవు. అనేక కంపెనీలు దివాళాతీసినవి. ఎన్నో యేండ్లనుండి పాతుకున్న కంపెనీల వర్తకము పూర్తిగా పడిపోయినది. ఆకంపెనీలు వ్యాపారమును కట్టిపెట్టినవి. అంకజాబాపిత్తాలు చూస్తే ఏమాపుపస్తున్నది. వడుకుయంత్రములు చూడబోతే కనుపు తరుగుకుపోతూంది. అమెరికానుండి ఒద్దన్నకొద్ది నూలువచ్చిపడుచున్నది. వాటికిధరలు అతిచౌకగా ఉన్నవి. ఇక ఆర్థికవిషయములలో గతసంవత్సరము మరింత అధ్వాన్నముగాయున్నది. 123 ప్రత్తికంపెనీలు లిక్విడేటు చేయబడినవి. వీనిలో 51 ఇతర కంపెనీలతో కలసి పునర్నిర్మాణముగావించుకొనుటకుగాను లిక్విడేటు చేయబడినవి. ఈ మిల్లులలో 40 నూలువడుకుమిల్లులు. 38 నేతమిల్లులు. ఎనిమిది వడుకు, నేత, కలసినమిల్లులు. నాల్గు వస్త్రములకు మెరుగు వస్గెరాపురమాయిషీ చేయుమిల్లులు. ముప్పదిమూడు సంఘములు వర్తకులయొక్కయు ఏజంట్లయొక్కయు సంఘములైయున్నవి. ఏబదినాల్గుకంపెనీలు పూర్తిగా దివాళాతీసినవి. వీని బాకీయాను 11,64,921 పౌనుల రుణమునకుఆస్తి 3,61,529 పౌనులు మాత్రమేకలదు. దివాళాతీసిన కంపెనీలలో 1 వడుకుమిల్లు. 9 నేతమిల్లులు. 3 మెరుగుపెట్టు మిల్లులు. 41 వర్తకులకంపెనీలు. 34 కంపెనీలకు రిసీవరులు ఏర్పాటయిరి. 98 కంపెనీలు తమ ఆస్తులనన్నిటిని 68 లక్షల పౌనులకు తాకట్టు పెట్టినవి.

41 కంపెనీలు ఇదివరకు అడుగకుండా ఉన్న షేరుధనమును తక్షణమే కట్టవలసినదని తమ వాటాదారులకు నోటీసుల నిచ్చినవి."

ఇంగ్లండులో ఈవిధముగా నేతపరిశ్రమ పడిపోయిన దని మనము సంతోషింపనేలసిన పనిలేదు. ఏలననగా ఇంకొక వైపునుండి జపాను ఇండియాలోప్రవేశించి హిందూదేశము నంతను తననూలుతోను వస్త్రములతోను నింపివేసినది. ఈశతాబ్దారంభమునందు జపానువర్తకము ఇండియాలో లేనేలేదని చెప్పవచ్చును. 1914 సం॥ లో జపానునుండి 940 బేళ్ల నూలుమాత్రము వచ్చెను. పండ్రెండు సంవత్సరముల అనంతరము అనగా 1926 సం॥ లో జపానునుండి 2,16,850 బేళ్లనూలు వచ్చెను. వానిఖరీదు 4 కోట్ల 20 లక్షల రూపాయిలు. 1915-16 సం॥ లో పరదేశములనుండి దిగుమతియైన నూలులో నూటికి 2 భాగములు మాత్రమే జపానునుండి వచ్చుచుండెను. ఇది 1922-23 సం॥ ములలో 45 కు పోచ్చెను. 1925-26 సం॥ ములలో 65 కు పోచ్చెను.

ఇండియాలో సాలుకు 5 కోట్లపౌనుల నూలు ఖర్చగుచున్నది. దీనిలో ఇండియా మిల్లులు సగముకంటె ఎక్కువ తయారుచేయుటలేదు. ఇండియాకు దిగుమతియగు నూలులో విశేషభాగము జపాను ఇంగ్లండులనుండియే వచ్చుచున్నది.

గత పండ్రెండుసంవత్సరములనుండి జపానునూలు దిగుమతి 30 రెట్లు హెచ్చుగా, సీమనూలు దిగుమతి నూటికి 50 వంతులు పడిపోవుట గమనింపదగియున్నది. సీమనుండిగాని జపానునుండిగాని వచ్చునూలులో విశేషభాగము 30-60 నెంబర్ల మధ్య నేయుండును.

1924 సం|| ఆఖరుకు ఇండియాలోకి దిగుమతియైన సీమనూలు ఖరీదు 4 కోట్లరూపాయిలుకాగా సీమబట్టలఖరీదు 54 కోట్ల రూపాయలయ్యెను.

ఇండియాలో ఎక్కుడచూచినను జపానునుండి దిగుమతియైన బూడిదరంగుబట్టలు హెచ్చుగానున్నవి. ఇవినచ్చి ఇంగ్లీషుబట్టలను త్రోసివేసినవి. జపానుబట్టలు క్రమముగా వృద్ధిపొందుటకు అవకాశములు చాల హెచ్చుగానున్నవి. నెలకు 8-9 వందల బేళ్ల జపానుసరుకు ఇండియాకు వచ్చుచున్నది.

జపానుదేశము తనసరుకులతో ఒకఇండియాదేశమునే కాక సీమదేశమునుకూడ ముంచివేయునట్లు కనిపించుచున్నది. "ఇండియాకు వస్త్రముల నెగుమతిచేయుటలో జపానుదేశము సీమదేశమును త్రోసిరాజనుటయేగాక, ఇండియాలో పండు యావత్తు ముడిప్రత్తినికూడ తానే కొనివేయునట్లు కను

పించుచున్నది. అట్లయినచో ఇకనుండి ముడిప్రత్తికై ఇంగ్లండు జపాను దేశమునే యాచించవలసినట్లు కనుపించుచున్నది" అని బర్నార్డు ఇల్లింజరను మాన్చెస్టరు ప్రత్తివర్తకుడు లండనులో నొకమహాసభలో విలపించెను.

ప్రపంచములో చవకబట్టకే ఎక్కువ గిరాకియుండునని జపాను గ్రహించినది. అందుచే ౭.కరకను చవకముడిప్రత్తిని ఉపయోగించి జపాను చాల చవకసరుకును తయారుచేయుచున్నది. ఇది సీమసరుకంత మంచిది కాకపోయినను ప్రజలకు పనిగడచుటకు చాలును. ప్రత్తిలో కల్తీకలుపుటలో జపానువారు మిక్కిలి తెలివిగలవారు. దీనిలోని రహస్యము ఎవరికిని తెలియకుండ బహుజాగ్రతగ దాచియుందురు. వ్యాపారమును కట్టుదిట్టముతో నిర్మించుకొనుటయందు ఇంగ్లండుకంటె జపాను ఎక్కువ నేర్పరితనమును గలిగియున్నది.

విడివిడిగనున్న చిన్నచిన్న కంపెనీల నన్నిటెనిచేర్చి పెద్దకంపెనీలుగ నిర్మించుకొనుట అవసరమని ఇల్లింజరుగారు సీమకంపెనీలకు సలహానిచ్చుచున్నారు. ప్రపంచములోగల వస్త్రముల ఎగుమతిలో సగమువంతు యిప్పటికిని యింగ్లండునుండియే యగుచున్నపనియు, తగుకట్టుదిట్టములు చేసికొన్నచో, యిదివరకుపోయిన ఐశ్వర్యమును యింగ్లండు తిరిగి

సంపాదించుకొనవచ్చుననియు ఎల్లింజరుగారు యింగ్లీషు కంపెనీలవారిని హెచ్చరించుచున్నారు.

జపానునుండి దిగుమతియైనబట్టతో ఐర్లండులోకుట్టిన చొక్కాలు లంకషైర్ మున్నగు సీమపట్టణములలో అక్కడి కంటె చవకధరలకు అమ్ముచున్నారట! జపాను "వెస్టు కోటులు" అతిచవకగా సీమలో అమ్ముడుపోవుచున్నవి! "ఈ రీతిగ పరాయిదేశపు వస్త్రములు మన లంకషైరు లోనికి జొరబడుచుండగచూచి మనము ఊరకుండవలెనా?" అని సీమలోని మార్నింగ్ పోస్టుపత్రిక విలపించుచున్నది. "బహుశః, జపానువారు తమకు సరిపోగా మిగిలిన బట్టలను మన యింగ్లండునకు తెచ్చి, యిక్కడ నష్టమునకు అమ్మకొనుచున్నారుకాబోలు" నని యీపత్రిక తనలో తానే సముదాయించుకొనుచున్నది.

ఇట్టి స్థితిలో మన ము సీమబట్టనుమానివేసి, జపాను బట్టను కట్టుకొందుమా? సీమమీద భక్తిని జపానుమీదికి బదులాయించుదమా? వస్త్ర పరిశ్రమద్వారానే మనరాజ్యము పోయినది సుమా యనుసంగతిని మనము యిప్పటికైనను గ్రహించుదుము గాక! "మనము వర్తక వేషముతో మొట్ట మొదట యిండియాకు వెడలినాము. ఇదియే మనభావిరాజ్య స్థాపనకు పునాది" అని యింగ్లీషుమంత్రి భర్కెన్ హెడ్డు

ప్రభువు స్పష్టముగ వ్యాపారికమేమియు లేక పక్షపాతించి యున్నాడు. ఇట్టిసందర్భములో, యీపర్యాయము మనము యూరిగియుండి గోతిలో దిగుదుమా? వెనుక యింగ్లీషువారు వచ్చినట్లే యిప్పుడు జపాను వారు వర్తకవేషముతో యిక్కడకువచ్చి రాజ్యస్థాపన చేసికొనుటకు అవకాశమిత్తుమా?

దేశమును సర్వసమృద్ధముగనొనర్చి, యీపురాతన దేశపు గౌరవమును నిలుపబెట్టుటకుగాను దేశప్రజలును, దేశీయ సంస్థానములవారును గొప్పప్రయత్నముల జేయుచున్నారు. తమ ఖజానానుండి ఒక దమ్మిడీయైనను ఖర్చులేకుండ, వేయి రైతు కుటుంబములవారికి కొక ఉపవృత్తిని కల్పించుటయను మహోత్కృష్టకార్యమును మైసూరు ప్రభుత్వమువారు 1928 సం॥లో గావించియున్నారు. మైసూరు ప్రభుత్వమువారిందుకై అవలంబించిన విధానము విదేశవస్త్ర బహిష్కారసంఘమువారు ప్రచురించిన రెండవ కరపత్రములో వివరింపబడియున్నది. దానిని పాఠకులు గమనింతురుగాక.

లంకషైర్ (సీమ) బట్టలవ్యాపారమునొక్క ముందు గతినిగూర్చి రష్‌బ్రుక్ విలియమ్సు అను ఆంగ్లేయుడిట్లు యిటీవల వ్రాయుచున్నాడు:— "ఇండియాలో యితర దేశపు బట్టలకంటె లంకషైర్ బట్టల కెక్కువ గిరాకీ యేమియు లేక పోగా, ప్రస్తుత రాజకీయ పరిస్థితులనుబట్టి, వాని మొగము

బొత్తుగ చూచేవాడేలేడు. పోటీ హెచ్చుగనుండి, ధరలు దాదాపు సమానముగనే యున్నప్పుడు దేశాభిమానముచే యిండియాప్రజలు మన సీమబట్టలను బహిష్కరించివేయుదురు. అప్పుడు మన యింగ్లండు వ్యవహారము తల్లక్రిందులగును.” అయితే, యితడు తెలివిగలవాడగుటచే యిండియాను రెండు భాగములుగ చీల్చుచున్నాడు. ఒకటి యింగ్లీషువారిపాలన క్రిందనున్నభాగము. రెండవది స్వదేశసంస్థానములవారిపాలన క్రింద నున్నభాగము. స్వదేశసంస్థానములలో ఏడుకోట్ల ప్రజలున్నారు; యిండియా వైశాల్యములో మూడవవంతు యీసంస్థానములక్రిందనున్నది. కాబట్టి, తనసీమబట్టలను కొనుక్కొనుటకు “యీయేడుకోట్ల సంస్థాన ప్రజలు వున్నారు. ఫరవాలేదులే” అని రష్బ్రుక్ విలియమ్సు గారు సంతోషించుచున్నారు. అదిగాక, రాచకీయవిషయములలో యింతవరకు యీస్వదేశసంస్థానములెట్లు యింగ్లీషువారికి మద్దతుగానుండెనో, అట్లే యిక వర్తకవిషయములో కూడ ( బట్టలమ్ముకొను విషయములోకూడ ) యీసంస్థానములు తమయింగ్లీషువారికి చేదోడు వాదోడుగనుండి, మద్దతు చేయునని యీవిలియమ్సుగారు నమ్ముచున్నారు.

పరదేశములనుండి యిండియాలోనికి దిగుమతియగు బట్టలపై ప్రస్తుతము కొద్దిగ పన్ను విధింపబడుచున్నది.

పన్ను స్వదేశసంస్థానములలోని రేవుపట్టణములగుండ దిగుమతి యగు వస్త్రములమీదకూడ విధింపబడి, యీసొమ్ము యిండియాగవర్నమెంటువారి ఖాతాకే జమకట్టబడుచున్నది. అయితే, నవనగర సంస్థానములోగల "బేడీ" యను ఒక్క రేవుపట్టణములో దిగుమతియగు బట్టలమీదమాత్రము పన్ను లేదు! అందుచే, యీరేవుగుండా యిటీవల విపరీతముగ సరుకు దిగుమతియైనది. అయితే ఈమినహాయింపు యీఒక్క రేవుపట్టణమున కేలయుంచవలయును? ఈమినహాయింపు నికమీద యిండియాగవర్నమెంటువారు తీసివేయుదురో, లేక దానినట్లే నిలుపుదురో యిప్పుడు చూడవలసియున్నది.

ఖద్దరును పునరుద్ధరించు యీప్రస్తుత మహోద్యమములో భారతదేశములోని ప్రతిపురుషుడు, ప్రతిస్త్రీ, ప్రతిపిల్లవాడు కూడ సహాయపడగలడు. వేయేల బట్టలమిల్లుల యజమానులు కూడ యిందుకుతోడ్పడుటకవకాశమున్నది. మిల్లుయజమానులు యీదిగువ కనబరచిన ఆరువిధములుగ యీయుద్యమమునకు సహాయము చేయవచ్చునని గాంధిగారు చెప్పియున్నారు:—

అవేవనగ:—

1. తమ ఏజెన్సీలద్వారా ఖద్దరును అమ్మిపెట్టవచ్చును.

2. తమ తెలివితేటలను, తమ నేతపరిజ్ఞానమును యీ యుద్యమాభివృద్ధికై వినియోగించి సహాయపడవచ్చును.

3. అఖిలభారత చర్ఖా సంఘమువారితో సంప్రతించుకొని, విదేశవస్త్ర బహిష్కారమునకు అనుకూలరీతిగ తామేయేరకప్రచురణలను ఉత్పత్తి చేయవలసియుండునో నిర్ణయించుకొనవచ్చును.

4. కత్తిఖద్దరును తామునేయుట మానివేయవచ్చును.

5. తమకు నష్టముగాని రీతిగను—తమకు విపరీతముగు లాభములు పెంచుకొనకుండగను, కరారు ధరలను దేశమండంతటను ఒకేరీతిగ నిర్ధారణచేసి స్థిరపరచుకొనవచ్చును.

6. ఈయుద్యమమునకు ద్రవ్యసహాయము చేయవచ్చును.

నిజమే ఖాదీఉద్యమము దేశాభిమానముతో కూడిన ఉద్యమమే. నిజముగ యిది జాతీయోద్యమము—వేయేల, యిదియే స్వరాజ్యోద్యమము. దీనివలన భారతదేశములోని ప్రతి మానవజీవితోను మనకు సంబంధమేర్పడును. జాతీయోద్యమమును గూర్చి మాట్లాడునప్పుడు, దేశములోగల ప్రతి మానవుడును తనధర్మములను తాను నెరవేర్చవలయునని తరుచు స్ఫురించుచుండును. ప్రతివానికి నాయకోపదేశ ఉపన్యాసములో చెప్పబడిన అన్ని పనులను చేయుటకు సాధ్యము కాకపోవచ్చును. కాని ఖద్దరుబట్ట కట్టుకొనుటకేమి? ఇది అందరికి సాధ్యమై యుండవలెను. ఖద్దరుబట్ట కంటికి మాత్రకగ గన్పించవచ్చును. కాని, పంటికి మెత్తగ గన్పట్టును

బజారునుండి చూచియితరులకు "వీడీ ముతకబట్ట కట్టుకున్నాడు. దేమి కర్మముర ?" అని జాలి తోచ వచ్చును. కాని, దానిని ధరించిన ఆవ్యక్తికిగలుగు మహదానందము మనస్సంతుష్టి చెప్ప తరముకాదు. ఖద్దరు చాలకాలము మన్నును. చలికాలములో వెచ్చగను, వేసవికాలములో చల్లగను వుండును. ధ్వనివలనగలుగు కంపమును తగ్గించుటలో ఖద్దరున కెక్కువ శక్తియున్నదని యిటీవలనే జగత్ప్రఖ్యాతి గాంచిన డాక్టరు జగదీశ చంద్రబోసుగారు కనిపెట్టియున్నారు. ప్రజల నిర్వ్యాపారమును, నిరుద్యోగమును పోగొట్టి, కోట్లకొలది జనులకు అన్నవస్త్రములనిచ్చుచున్నది. ఈఖద్దరు ఉద్యమము. భారతజాతియొక్క ఆత్మగౌరవమును పెంపొందించు చున్నది యీఖద్దరు ఉద్యమము. స్వరాజ్యస్థాపనకై భారతజాతి సల్పు మహాశాంతి సమరమందీ ఖద్దరే శాంతిసైనికుల కెల్లరకు "యూనిఫారం డ్రెస్" గ నున్నది. వేయేల, భారతజాతీయ నిర్మాణ కార్యక్రమములో యీఖద్దరే ప్రధానభాగముగనుండి ఖద్దరును ఉత్పత్తిచేయు పనియే యీసైనికుల కెల్లరకు "డ్రిల్లు" గ నియమింపబడినది. రాట్నము వడుకునప్పుడు నీమనస్సునకు యేకాగ్రత చేకూరుచున్నది. కాలము వృథగాక సత్కార్యమందు వినియోగపడుచున్నది; నీభావములు అటు నిటు పరుగెత్తకుండ ఒకచోట కట్టివేయుచున్నది. నీచిత్త వికారములనెల్ల నణచివేసి, నీకు మంచిసాధన నొసంగుచున్నది.

క్రోధము, చిరాకు, గలిగినప్పుడు నీవు తోటమువద్ద కూర్చుని వడక నారంభింపుము. నీమనస్సు కలత చెందినప్పుడు రాట్నమువద్ద కూర్చుండుము. ఒక్క అరగంటసేపు వడికే టప్పటికల్లా, నీతామసగుణములన్నియు అణగి, నీవు సాత్త్వక జీవివగుదువు. ప్రతివాడు మహాయోధుడై సైన్యవాహినులను నడిపింపలేక పోవచ్చును; ప్రతివాడు భాగ్యవంతుడై గుళ్లు గోపురములు కట్టించలేక పోవచ్చును, దేశసేవానిరతుడగు సైనికుడు తనకీర్తి ప్రతిష్టలు ప్రపంచములో నలుగురికి ఆడంబరముగ చాటి చెప్పుకొనుటకు వీలులేకుండ, యేదో మారు మూలను, ఒంటరిగ తన నాయకుడు నియమించిన చోటనే యుండి, తనవిధిని తాను నిష్కామబుద్ధితో నెరవేర్చుచుండునో నిజమగు భక్తుడు దేవాలయాగ్రముపై నెక్కి మహాయాడంబరముగ నలుగురు తనవంకనే చూచి తన్నే మెచ్చుకొనవలెనని కోరకుండ, యేదోమూలనొదిగి, దేవతాదర్శనమునకై ఓపికతో ఒంటరిగ భక్తిభావముతో నిరీక్షించుచుండునో—అట్లే—ఖద్ధరునకై పనిచేయువాడు మహాయాడంబరముగ తనపేరు పత్రికలలోను ప్లాటుఫారములమీదను మారుమ్రోగవలయునని కోరకుండ, తనకు విధించిన స్థానమందుండి కదలకుండ ఒంటరిగ, ఓపికతో, తనపనిని దీక్షతో సాగించుచుండవలయును. అదియే నిజమగుదేశసేవ, అదియే నిజమగు మానవసేవ. ప్రాగు

టకు గంజియైన లేక మలమల మాడుచుండ ప్రజల క్షుధార్తిని పోగొట్టి దేశమును పూర్వపురీతిగ సర్వసమృద్ధమొనర్చి దేశగౌరవమును నిలువబెట్టుటయే నిజమగుమానవసేవ. నిజముగ ఇట్టిసేవ జేయువాడు ఆడంబరములకై యెన్నడు యొగబ్రాకడు. భారతదేశమున కిప్పుడు క్లిష్టస్థితి—సందిగ్ధస్థితి సంభవించినది. భారతదేశ మిప్పుడు రాట్నచక్రమును చేపట్టునా, లేక యంత్రచక్రమును చేపట్టునా? ఖాదీ ధరించునా, లేక "ఖాకీ" ని ధరించునా? ఇట్టి సందిగ్ధతరుణములో భారతదేశమునకు రాట్నమే శరణ్యమని వేరుగ వ్రాయనక్కరలేదు. శ్రీ కృష్ణ దేవరాయ ఆంధ్ర భాషానిలయమునకు,

...................... వ్యాసవర్గము

విభాగ సంఖ్య ...................... ప—౩

